# మహాకవి గురజాడ

## జీవితవిశేషాలు

## సాహిత్యసమీక్ష



దేవులపల్లి ప్రభాకరరావు

ప్రథమ ప్రచురణ
జూలై 1969

*1968 వ సంవత్సరంలో యునెస్కో (UNESCO) పక్షాన కేంద్ర ప్రభుత్వ విద్యామంత్రిత్వశాఖ అఖిలభారత స్థాయిలో నిర్వహించిన పుస్తక రచన పోటీలో అత్యుత్తమ తెలుగు రచనగా 1650 రూ. బహుమతి ఈ పుస్తకానికి లభించింది.*

*విశాలాంధ్ర ప్రచురణాలయానికి, కీర్తిశేషులు అవసరాల సూర్యారావుకు ఎన్నో కృతజ్ఞతలు.*

ముఖ చిత్రరచన ;
మిత్రులు ప్రసాద్, రహీం.

ముద్రణ :
శివాజీ ప్రెస్
గంజ్ బజారు, సికిందరాబాదు.

# దేశభక్తి

దేశమును ప్రేమించుమన్నా,
మంచి అన్నది పెంచుమన్నా
వొట్టిమాటలు కట్టిపెట్టోయ్,
గట్టిమేల్ తలపెట్టవోయ్

పాడి పంటలు పొంగి పొర్లే
దారిలోనువు పాటుపడవోయ్ ;
తిండికలిగితె కండకలదోయ్ !
కండ కలవాడేను మనిషోయ్ !

యీసురోమని మనుషులుంటే
దేశమేగతి బాగుపడునోయ్ ?
జల్దుకొని కళలెల్ల నేర్చుకు
దేశిసరుకులు నించవోయ్

అన్నిదేశాల్ క్రమ్మవలెనోయ్,
దేశిసరకుల నమ్మవలెనోయ్ !
డబ్బుతేలేనట్టి నరులకు
కీర్తి సంపద లబ్బవోయ్

వెనుక చూసిన కార్యమేమోయ్ ?
మంచి గతమున కొంచె మేనోయ్
మందగించక ముందు అడుగేయ్
వెనుక పడితే వెనకె నోయ్

పూను స్పర్థను విద్యలందే
వైరములు వాణిజ్యమందే
వ్యర్థకలహం పెంచబోకోయ్
కత్తివైరం కాల్చవోయ్ !
దేశాభిమానం నాకు కద్దని
వొట్టి గొప్పలు చెప్పుకోకోయ్ ;
పూని యేదైనాను వొకమేల్
కూర్చి జనులకు చూపవోయ్ !

ఓర్వలేమి పిశాచి దేశం
మూలుగులు పీల్చేసెనోయ్,
ఒరుల మేలుకు సంతసిస్తూ
ఐకమత్యం నేర్చవోయ్ !

పరుల కలిమికి పొర్లియేడ్చే
పాపికెక్కడ సుఖం కద్దోయ్ ?
ఒకరిమేల్ తనమేల నెంచే
నేర్పరికి మేల్ కొల్లలోయ్ !

స్వంత లాభం కొంతమానుకు
పొరుగువాడికి తోడుపడవోయ్
దేశమంటే మట్టి కాదోయ్,
దేశమంటే మనుషులోయ్ !

చెట్టపట్టాల్ పట్టుకొని
దేశస్థులంతా నడవ వలెనోయ్ !
అన్నదమ్ముల వలెను జాతులు
మతములన్నీ మెలగవలెనోయ్

మతం వేరై తేను యేమోయ్ ?
మనసులొకటై మనుషులుంటే
జాతమన్నది లేచిపెరిగి
లోకమున రాణించునోయ్ !

దేశమనియెడి దొడ్డ వృక్షం
ప్రేమలను పూలెత్తవలెనోయ్,
నరుల చమటను తడిసి మూలం
ధనం పంటలు పండవలెనోయ్ !

ఆకులందున అణగిమణగీ
కవితకోయిల పలుక వలెనోయ్
పలుకులను విని దేశమందభి
మానములు మొలకెత్తవలెనోయ్ !

# ఆహ్వాన పత్రమే అర్హతా పత్రం

"గురజాడవారి కథ మన కథ; మన తెలుగు కథ; మన భాష, సాహిత్యం, సంస్కృతి కథ" అన్నాడు యువకుడు, ఉత్సాహవంతుడు, స్నేహశీలి అయిన దేవులపల్లి ప్రభాకరరావు 'మహాకవి గురజాడ' అన్న ఈ పుస్తకంలో.

చిన్నవాడైనా ఈ రచయిత మిన్నగా చెప్పాడు. నిత్యనూతనత్వానికి నిలయమైన గురజాడ కథ ముమ్మాటికీ తెలుగుజాతి కథ.

గురజాడను గురించి చెబుతూ "మూఢవిశ్వాసాల 'చదల చీకటిని కదలద్రోలిన' వైతాళికుడు అప్పారావు" అన్నాడు రచయిత.

కన్యాశుల్కంతొలికూర్పు పీఠికలో "...literature cannot have a higher function than to show up such practices and give currency to a high standard of moral ideas..." (కన్యాశుల్కం వంటి సాంఘిక దురాచారాలను బట్టబయలు చేయడం, ఉన్నత నైతిక భావనలను అభివ్యాప్తం చేయడం కంటే సాహిత్యానికి మరో ప్రయోజనం వుండబోదు" అన్నారు గురజాడ.

నేటి యువతరం రచయితల మీద అప్పారావుగారి ప్రభావం ఎంతవుందో చూపించడానికి ఈ పుస్తకం ఒక ఉత్తమమైన ఉదాహరణ.

గురజాడ ఆలోచనారీతి ఎంతో విప్లవాత్మకమైనది. లోకులు అశుభసూచక మనుకునే తోకచుక్కను

"తలతునేనిది సంఘ సంస్కర
ణ ప్రయాణ పతాకగా"

అన్న గురజాడ మన కందరికి మార్గదర్శి, మహర్షి.

అటువంటి మహాకవి జీవిత విశేషాలనూ, ఆయన రచనలపై సమీక్షను ప్రతి తెలుగువాడికి సుబోధకంగా ఉండే రీతిని చక్కని శైలిలో రచించిన ఈ రచయితను అభినందించక తప్పదు.

"నూతనమైన ఉత్సాహాన్ని కల్గించి, నవ్యమైన పురోగమన శీలమైన శక్తిని ప్రసాదించే అప్పారాయ మహాకవి సాహిత్య ప్రపంచంలోకి ఇదొక ఆహ్వాన పత్రం" అన్నారు రచయిత ఈ పుస్తకాన్ని గూర్చి చెబుతూ....

గురజాడ సాహిత్య ప్రపంచంలోకి ఇది ఆహ్వాన పత్రం కావడంతోపాటు దేవులపల్లి ప్రభాకరరావుకు ఉత్తమ రచయితగా ఇది అర్హతాపత్రంగా కూడా రూపొందింది.

ఐక్యరాజ్య సమితి విద్యావైజ్ఞానిక సాంస్కృతిక సంస్థ (Unesco) పక్షాన భారత ప్రభుత్వ విద్యామంత్రిత్వశాఖవారు 1968 లో అఖిల భారతస్థాయిన నిర్వహించిన పుస్తక రచన పోటీలో 'మహాకవి గురజాడ' అనే ఈ పుస్తకం తెలుగులో అత్యుత్తమ గ్రంథంగా నిర్ణయించబడి పదహారువందలయాభై రూపాయల బహుమతిని పొందింది. నిజానికి మా ప్రభాకరరావు ఎంతోకాలం శ్రమించి అప్పారావుగారి జీవితాన్ని గురించీ, ఆయన రచనలను గురించీ కూలంకషంగా పరిశీలించి, పరిశోధించి పెద్ద పుస్తకమే వ్రాశాడు. కాని పోటీ నిబంధనలను అనుసరించి ఇంతకంటే పెద్ద పుస్తకం పంపడానికి వీలులేక పోవడం వలన ఎన్నెన్నో వివరాలను తగ్గించి, కుదించి ఈ చిన్ని పుస్తకంగా రూపొందించాడు.

చక్కని పదజాలంతో, ప్రసన్నమైన శైలితో, ఆసక్తిని కలిగించే విశేషాలతో, కమ్మని నుడికారంతో, నిరుపమానమైన పరిశీలనాశక్తితో ఈ రచయిత ఈ పుస్తకాన్ని రచించాడు. ఈ చాతుర్యం ప్రభాకరరావుకు వెన్నతోపెట్టిన విద్య. ఇది ఇతని తొలి రచన కానేకాదు. సుమారు ఒక పుష్కరంనుంచి ప్రచ్ఛన్న నామములతో ఎన్నో రచనలు చేశాడు. అయితే రచయిత అసలుపేరుతో వెలువడుతున్న తొలి పుస్తకం ఇదే.

ఈ పుస్తకం చతువుతున్నప్పుడు నా హృదయాన్ని కదలించిన ఘట్టాలన్నిటినీ ఇక్కడ ఉదహరించడం సాధ్యం కాదుగాని కొన్నిటిని మాత్రం చెప్పకుండ ఉండలేను.

బాల్యదశలో గురజాడలోని గ్రంథ పఠనాసక్తిని గురించి (7వ పుటలో) "మరెవరోకాదు" అన్న ఆకర్షవంతమైన ఉపశీర్షిక క్రింద చెప్పినతీరు నన్ను ముగ్ధుని చేసింది.

"....విజయనగరం క్లాక్‌టవర్ దగ్గర్లో పాతపుస్తకాలు అమ్మేచోట యెప్పుడూ ఒక పిల్లవాడు కన్పిస్తుంటాడు. ఆ పిల్లవాడు బక్కపలచనివాడు. అయినా అందమైన వాడు. కన్నుల్లో కాంతి ఉంది...............ఎన్ని పుస్తకాలు చదివినా పిల్లవాడికి తృప్తిలే

నట్టుంది......" అంటూ ఆఖరున......"అప్పారావుగారి చిన్నప్పటినుండి ఆయన ముచ్చటలను కళ్ళారా తిలకించిన ఆ క్లాక్‌టవర్, ఆ మైదానం మూగవికాకుంటే ఎంత బాగుండును" అంటాడు రచయిత. గురజాడ జీవితంలోని ప్రతిక్షణం విలువైనది. ఆ విశేషాలన్నీ తెలిస్తే ఇంకా యెంత బాగుండును! ఆ క్లాక్‌టవర్ తానెరిగిన వివరాలన్నీ చెబితే యెంత బాగుండును! అన్న ఆరాటం, ఆకాంక్ష రచయితలో అడుగడుగునా కనిపిస్తాయి.

"గుండె దస్సుమంటుంది"
"పండ్లపుల్లలు లేకుంటే దాటక పోయేది"

వంటి చక్కని పలుకుబడులు మన ప్రభాకరుని రచనలో అడుగడుగునా మనకు తగులుతాయి. అక్కడక్కడా సున్నితమైన హాస్యం, కొంచెంగా చురుకు తగిలించే రీతిని వుంటుంది. ఉదాహరణకు—"పసిపాపలకు పెళ్ళిళ్ళు చేయడం మొదలుకొని పిశాచాలను సీసాలో పట్టడం వరకు విశ్వరూపం దాల్చిన మూఢత్వాన్ని...." వంటివి....

గురజాడ కన్యాశుల్క రచనకు ఎందుకు పూనుకున్నారో, బిడియమనేది అడ్డు వస్తున్నా కన్యాశుల్క నాటకాన్ని గొప్ప రచనగా రూపొందించానని తాను ఎలా అనుకున్నారో, తన నాటకం చదివి తానే ఎలా ముగ్ధులయారో చాలా విపులంగా చర్చించాడు ప్రభాకరుడు ఈ పుస్తకంలో.

బహుముఖ ప్రజ్ఞాశాలియైన గురజాడ సంపూర్ణ జీవితస్వరూపాన్ని కళ్ళకు కట్టేటు బహుచాకచక్యంతో ఈ చిన్ని పుస్తకంలో పొందుపరచిన ఈ రచయిత శక్తిశాలి. పుస్తకం చివరను "సాహిత్య సమీక్ష" అనే ప్రకరణంలో గురజాడ వారి ముత్యాల సరాలు, మరి ఇతర రచనలయెడ తనకుగల భావాలను ఎంతో సమంజసంగా, హేతుబద్ధంగా వివరించాడు రచయిత.

"అప్పారావుగారి ఆలోచనలు కాలంకంటె ముందు పరుగెత్తుతాయని చెప్పడానికి—"

"మలిన దేహుల మాలలనుచును" వంటి గీతాలను ఉదహరించాడు రచయిత.

"అప్పారాయ మహాకవి గేయాలను చదువుతున్నప్పుడు మనం ఒకేసారి పాఠకులం, శ్రోతలం, ప్రేక్షకులమూ అవుతాము" అన్న ఈ రచయిత అభిప్రాయంతో నేను పూర్తిగా ఏకీభవిస్తున్నాను. అప్పారావుగారిలోని నాటక రచనాశక్తి సజీవమైన రూపాలను కవితలో సైతం చిత్రింపజేసింది.

భక్తితో, అనురక్తితో, ఆసక్తితో, పరిశీలనతో, పరిశోధనతో గురజాడను అధ్యయనం చేసిన ఈ యువరచయిత యెవరు ? తెలంగాణా సాహిత్యోద్యమ వైతాళికులు, ఆంధ్ర ప్రదేశ్ సాహిత్య అకాడమీ కార్యదర్శి, ప్రముఖ రచయిత, విమర్శకులు, పాత్రికేయులు, దేశభక్తులు అయిన శ్రీ దేవులపల్లి రామానుజరావుగారి సోదరుడు....వీరిది పండిత వంశం. వీరి తండ్రిగారు శ్రీ దేవులపల్లి వెంకటాచలపతి రావుగారు విద్వాంసులు, కవులు, కవిపోషకులు.

"మహాకవి గురజాడ" అనే ఈ గ్రంథాన్ని సరళంగా, సరసంగా, సమర్థ వంతంగా రచించి యునెస్కో వారి అమూల్యమైన బహుమానం పొందినందుకు చిరంజీవి దేవులపల్లి ప్రభాకరరావును అభినందిస్తూ-ఇంకా ఎన్నో సరికొత్త ఉత్తమ రచనలను వెలువరించగలడని ఆశిస్తూ-పాఠకులు ఈ పుస్తకం ద్వారా నూతన స్ఫూర్తిని పొంది గురజాడ రచనలన్నిటినీ సావధానంగా పఠించగలరని విశ్వసిస్తున్నాను.

భాయీ ప్రభాకర్ ! కవికుల గురువు కాళిదాసైతే నవకవి గురువు గురజాడ. "మహాకవి గురజాడ" ద్వారా నీవు గోదాలో దిగావు. విజయం సాధించావు. ఇక మరింతగా విజృంభించు....ఆధునిక సాహితీరంగాన్ని ఆవరించు.

30-7-1969
మద్రాసు

నీకు ఉజ్వల భవిష్యత్తును కాంక్షించే
నీ
దాశరధి

# ఆశీస్సులు

మహాకవి గురజాడ అప్పారావుగారితో తనకు వ్యక్తిగతంగా ఏ మాత్రం పరిచయం లేకపోయినా వారి సాహిత్యాన్ని, వారి గురించి ఉన్న వాఙ్మయాన్ని శ్రద్ధా సక్తులతో అధ్యయనంచేసి వారి మాటలలోను, రచనలోను ఉన్న ఉన్నత ఆశయాలను గుర్తించి కమ్మని వ్యావహారిక భాషలో, ఎంతో అందమైన, ఆహ్లాదకరమైన శరవేగపు శైలితో దేవులపల్లి ప్రభాకరరావు ఈ పుస్తకం వ్రాశాడు. అభ్యుదయశీలి ప్రభాకరరావు కళాశాల విద్యార్థిగా ఉన్నప్పటినుంచే అతనితోను, ఆతని రచనలతోను నాకు చిరపరి చయం. రచయితగా ప్రభాకరరావును గురించి నేను ఉన్నతంగా ఆశించినదంతా అక్షర రూపంలో నిజం అవుతున్నందుకు హర్షిస్తున్నాను.

ఈ పుస్తకం చిన్నదైనా, ఆ మహాకవి జీవిత చరిత్రలో చేర్చవలసిన ముఖ్య విషయాలను వేటిని విడిచిపెట్టలేదు. మహాకవి బహుముఖ ప్రతిభను తెలియజేసే విద్యా విశేషాలూ, ఉద్యోగిగా ఆయన చేసిన అనేక విధాలయిన కార్యాలలో చూపిన తెలివి తేటలూ ప్రభాకరరావు కరతలామలకంగా చూపించాడు. అప్పారావుగారి ఆలోచనా పటిమా, సమస్యలను పరిష్కరించిన నేర్పూ, వాటిని చూచి ముగ్ధులయిన ఉత్తమాధి కారులు, మహామేధావులు కురిపించిన ప్రశంసలు ఈ పుస్తకంలో వివరంగా కన్పిస్తాయి. మహాకవి గురజాడతో తాను నిర్మించుకున్న పరిచయ సంపదను పంచిపెట్టి ప్రభాకరరావు పాఠకులను ఉత్తేజపరుస్తాడు. ఈ చిన్న పుస్తకంలో తన రచనా విన్యాసాన్ని ఇంతగా చూప గలిగిన ప్రభాకరరావును అభినందిస్తున్నాను.

గురజాడ అనేకవిధాలా ఆదర్శప్రాయుడు. ఆ సత్యాన్ని ప్రభాకరరావు స్పష్టంగా నిరూపించాడు. విద్యాసముపార్జనయందు ఏలాంటి దీక్షను పూనాలో, విజ్ఞానాన్ని ఏవిధంగా ఉపయోగించి మహనీయుల ప్రశంసా పరంపరలు అందుకోవాలో చూపించి గురజాడ విద్యార్థులకు ఆదర్శ పురుషులయారు. సంఘజీవనంలో ప్రబలుతున్న దోషాలను నిర్మూలించి నీతి నిజాయితీలను తెలిపే సత్యాన్ని ప్రకటించడానికి గట్టిగా కృషిచెయ్యా లని అప్పారావుగారు యువకులకు ఆదర్శ పురుషులయారు. 'సొంత లాభం కొంత మానుకు పొరుగువాడికి తోడుపడవోయ్' అని ఆనాడే మహాకవి శాంతియుత సహజీవన

సూత్రపు సారాన్ని ప్రబోధించి, దానిని ఆలో నిరూపించదగ్గంచి భావితరాలకు అడుగు జాడలు వేశారు.

'దేశమును ప్రేమించుమన్నా' అని మహాత్మాగాంధీగారి ప్రేమసూత్రాన్ని విశ్వ జనీనంగా చాటి, 'దేశమంటే మట్టికాదోయ్, దేశమంటే మనుషులోయ్' అని ఆ సూత్రానికి నిర్వచనం చెప్పి, ఆ నిర్వచనానికి అనుగుణంగా ప్రవర్తించి మహాకవి గురజాడ సకలదేశాల ప్రజలకు సన్నిహిత సాహితీ బంధువయ్యాడు. అనర్ఘరత్నంవంటి ఈ దేశభక్తి గీతాన్ని గురించి ప్రభాకరరావు అమోఘంగా వర్ణించాడు. ఈ పుస్తకం రెండవ అధ్యాయం 'సాహిత్య సమీక్ష'లోని 'దేశమును ప్రేమించుమన్నా' ఉపశీర్షికలో ప్రభాకరరావు వ్రాసిన వాక్యాలు ప్రత్యక్షర సత్యాలు. ఇది మళ్ళీ మళ్ళీ పదిసార్లు చదువవలసిన భాగం. అనకూడదుగాని ఇంతవరకు తెలుగుదేశంలో రచితమైన దేశభక్తి గీతాలు కొన్ని అప్పుడే పాతబడి పోతున్నాయి. మరికొన్ని సజీవంగా వ్యాప్తిలో ఉండాలంటే దేశకాల పరిస్థితుల కవసరమైన సవరణలు చేయవలసి ఉంటుంది.

ఇంత ఉదాత్తమైన విషయాన్ని ప్రభాకరరావు ఎంత తేలికయిన మాటలలో పొందుపరిచాడో గ్రహించగలిగితే పాఠకులకు తెలుగు పదాలు పేలవమైనవి కావనీ, చాల శక్తివంతమై ముద్దులొలుకుతూ ఉంటాయని స్పష్టంకాక తప్పదు. ప్రభాకరరావు రచనలో ఇది అడుగడుగునా ద్యోతకమవుతుంది.

గురజాడ అప్పారావు మహాకవి అవుతాడా! అసలు సాధారణ కవి అయినా అవుతాడా?అని అంటుండే సందేహాల సాంబయ్యలకు ప్రభాకరరావు ఈ రచనరూపంగా చెంప పెట్టు పెట్టాడు. పుస్తకాల కాగితాల తూకాన్ని పట్టి కవుల తారతమ్యాలు నిర్ణయిస్తే గురజాడవారు మహాకవి కారని ఒప్పుకుంటాము. వారు ప్రచురించిన రచనలు చాల స్వల్పసంఖ్యలోనే ఉన్నాయి. కాని, గుణవిశేషాల ద్వారా న్యూనతా, ఆధిక్యతా తెలుసుకుంటే వారు మహాకవే. ముమ్మాటికి మహాకవే. అంతేకాదు ప్రజాకవి; విశ్వకవి గూడ అవుతారు. మహాకవి గురజాడ తాము వ్రాసిన ప్రతి గ్రంథంలోను ఎంతగా విశ్వ శ్రేయస్సును కాంక్షించారో స్పష్టంగా తెలుస్తుంది. ఆ కాంక్షే వారిని రచనలకు పురికొల్పింది.

ఆనాడు క్రౌంచపక్షుల జంటలో ఒకదానిని బోయవాడు చంపినప్పుడు హృదయం ద్రవించి వాల్మీకి మహర్షి కావ్యరచనకు పూనుకున్నట్టే మహాకవి గురుజాడ దేశంలో వ్యాపించి ఉన్న దురాచారాలు, అనాచారాలూ, అవినీతీ, అసమానతా, స్త్రీజన హింసా,

మొదలైన ఘోరదుర్గుణాలనుచూచి ద్రవించిపోయి, హృదయము నీరయి కావ్యరచనకు పూనుకున్నాడని, సంస్కృత కావ్య రచనకు వాల్మీకి మూలపురుషుడైనట్టే గురజాడ తెలుగు వ్యావహారిక రచనకు పితామహుడని ప్రభాకరరావు చాల చక్కని సాదృశ్యము సూచించాడు. ఆ దురాచారాలను నిర్మూలించడానికి మహాకవి గురజాడ మహత్తరమైన నాటకాలూ, గేయాలు, కథలూ సృష్టించారు. ఇవి ఎప్పటికీ భావికి మార్గదర్శికాలుగానే ఉంటాయి.

అప్పారావుగారి దృష్టి చాల సున్నితమై దశాబ్దాలు దాటి శతాబ్దాల అంచులు తాకుతుందని ప్రభాకరరావు అంటాడు. ఇది వాస్తవం. ఒక సన్నివేశంలో అప్పారావు "ఈనాడు మానవుడు ప్రకృతికి లోబడి ఉన్నాడు. ఇంకా అనతి కాలంలో ప్రకృతే మనుషులకు సేవ చేస్తుంది" అని జోస్యం చెప్పగలిగారు. వ్యావహారిక భాషను మద్రాసు యూనివర్సిటీ వారు నిషేధించి నప్పుడు గురజాడవారు "ఎవరు ఏమి చేస్తే నేమి-మరి నాలుగు రోజులలో ఆంధ్ర దేశమంతా నా భాషనే ఉపయోగిస్తారు" అని తమ ఆత్మవిశ్వాసం ప్రకటించారు

తోకచుక్కను చూచి మహాకవి గురజాడ తమ ప్రేయసితో

దూరబంధువు ఇతడు భూమికి
దారిబోవుచు చూడ వచ్చెను

అని ఆనాడని,ఈనాడుఆర్మ్‌స్ట్రాంగ్ మొదలైన వ్యోమగాములు రుజువుచేస్తున్నసత్యాన్ని వ్యక్తీకరించారు. దానితోపాటు వారి శాస్త్రవిజ్ఞానం, ఆధునిక దృక్పథం తెలియపరిచారు.

ఇన్ని విషయాలతో నిండిన గురజాడ జీవితం ప్రభాకరరావువంటి యువకుడికి, అభ్యుదయ శీలుడికి ఎంత ఆసక్తిదాయకంగా ఉంటుందో చెప్పనక్కరలేదు. వర్ణించే విషయాన్నిబట్టి మహాకవి భావమూ, మహాకవి గురజాడ భావాన్ని పట్టి ప్రభాకరరావు కలమూ ఉత్సాహంతో ప్రవర్తిస్తుంటాయి, పరుగులెత్తు తుంటాయి. ఈ ఉత్సాహము తెచ్చిపెట్టుకొన్నది కాదు; విషయగౌరవంవల్లా, ఆ భావయోగ్యతవల్లా సహజంగా ప్రభాకరరావులో పెల్లుబికి వచ్చిన ఉత్సాహం ఇది కాబట్టే ఈ చిన్న రచన ఇంతగా ప్రశంసా పాత్రమయింది. ధారాళమైన శైలితో, కదిలించే శక్తితో నడచిన ప్రభాకరరావు రచన నన్ను ముగ్ధుణ్ణిచేసి పులకరింప చేసింది; నాకు ఈ చిన్న పుస్తకం అంతులేని ఆనందాన్ని కలిగించింది.

వ్యావహారిక భాషావివాద రంగములో అప్పారావుగారు చేసిన వీరవిహారమంతా ప్రభాకరరావు పాఠకలోకానికి ప్రత్యక్షం కావించి ధన్యుడయాడు. పండితులు ఏమను కున్నా, విశ్వవిద్యాలయాలు ఏ ఇరుకుల దారులలో పయనించినా, ఈనాడు లక్షోప లక్షలు, కోటానుకోట్లు వ్యావహారిక భాషనే ఉపయోగిస్తున్నారు. మహాకవి గురజాడ అడుగుజాడలలో ప్రభాకరరావువంటి యువ రచయితలు వ్యావహారిక భాషనే పదునైన ఆయుధంగా ప్రయోగిస్తున్నారు. నిజానికి గురజాడ ఆశలన్నీ ఆధునికభావాలు కలిగిన యువకుల మీదనే కదా! ప్రతిభావంతంగా, ప్రజ్ఞావంతంగా, ప్రశంసనీయంగా ప్రభాకరరావు ఈ పుస్తకాన్ని రచించాడు. ప్రభాకరరావు రచనాశక్తికి, ప్రతిభకు ఈ చిన్న పుస్తకం ఒక మచ్చుతునక. గురజాడ బాటలో, అభ్యుదయ రచయితగా, ప్రభాకరరావు ఉన్నత శిఖరాలను అందుకోగలడని హృదయ పూర్వకంగా ఆశిస్తూ ఇవే నా ఆశీస్సులను అందజేస్తున్నాను.

హైదరాబాదు
18 వ ఆగష్టు 1969

తాపీ ధర్మారావు

# మహాకవి గురజాడ

—x—

## జీవిత కథ

ఇది మన కథ. ఇది మన తెలుగు కథ ; మన భాష, సాహిత్యం, సంస్కృతి కథ. ఇది మన ఆధునిక మహాకవి గురజాడ అప్పారావుగారి కథ. దేశమంటే మట్టికాదని, దేశమంటే మనుషులని, దేశాభిమానం నాకు కద్దని వొట్టి గొప్పలు చెప్పవద్దని చక్కని గీతం ద్వారా మనలో దేశభక్తిని పెంపొందించే మహాకవి గురజాడ కథ ఇది.

## అత్యంత ఆధునికుడు

అప్పారావుగారు అసువులను విడిచి యేబది సంవత్సరాలయింది. ఏబది సంవత్సరాల తరువాత నేడు గూడ అప్పారావుగారిని ప్రాచీనుల పట్టికలో చేర్చడానికి వీలులేకుండా ఉన్నది. ఎందుకంటే చదివినకొద్దీ గురజాడ రచనల్లో అమితమైన ఆధునికత్వం తొణికిసలాడుతుంది ; పరిశీలించిన కొద్దీ గురజాడ ప్రతిభ కన్నులకు మిరుమిట్లు గొల్పుతుంది ; ఆయన రచనల అందం కాలంతోపాటు కొత్త కొత్త అర్థాలను స్ఫురింపచేస్తుంది. అప్పారావుగారు నిత్య నూతనులు ; అత్యంత ఆధునికుడు ఆయన. తెలుగు జాతి జీవితంలో కొత్తదనాన్ని మొలకెత్తించినవాడు గురజాడ అప్పారావు. ఆయన ఒకచోట అన్నట్లు "వృద్ధాప్యం మన శరీరాలకు మాత్రమే ; మన హృదయాలు నిత్యం పడుచుదనంతో ఉంటవి. పవిత్ర భావంలో ఉన్న అందం ఎన్నటికీ చెరగదు. అది నిత్య నూతనం" అవును. ఆయన కావ్యాల్లో, రచనల్లో కనుపించే ఆయన హృదయం పడుచుదనం, పవిత్ర భావాల అందం ఎన్నటికి చెరగనట్టివి.

## అభ్యుదయ మార్గదర్శకుడు

మన తెలుగు వాఙ్మయ ప్రపంచంలో పర్జన్య శంఖం పూరించిన అర్జునుడు అప్పారావుగారు. సవ్యసాచివలె ఎక్కడ చూచినా తానై పలు మార్గాలలో ప్రజ్ఞను వెదజల్లిన మహా మనీషి ఆయన. "ఢంకా దెబ్బ విన్న తరువాత యుద్ధంలో జొరక నిల్వడం కష్టం!" అని ఫల్గుణునివలె ప్రగమించి విజయుడైన సాహిత్య విప్లవకారుడు గురజాడ అప్పారావు. మూఢమైన విశ్వాసాల చదల చీకటిని కదలద్రోలిన వైతాళికుడు గురజాడ అప్పారాయ కవి. తెలుగు సాహిత్యంలో నూతన యుగానికి కందుకూరి వీరేశలింగంతో పాటు అప్పారావు గారే ఆద్యులు, ప్రారంభకులు. "నాది ప్రజల ఉద్యమం. ఎవరిని సంతోష పెట్టడానికైనా దానిని వదలుకోలేను—" అన్న ఉద్ఘాటనతో తెలుగు సాహిత్య రంగంలో ప్రజాస్వామిక భావాలను ప్రవేశ పెట్టిన ఘనత అప్పారావు గారిదే. ప్రజలకొరకు తమ సాహిత్యాన్ని ఉద్దేశించి, తమ రచనల మంచి చెడ్డల నిర్ణయాన్ని ప్రజలకు వదలిపెట్టిన మొట్టమొదటి ప్రజాకవి గురజాడ అప్పారావు. కవితలో, కథలలో, నాటకాలలో, వ్యాస విన్యాసాలలో, డైరీలలో, ఉత్తరాలలో గురజాడ వెలయించిన సౌరులు అపూర్వమైనవి, అసాధారణమైనవి. ఆయన రచనలన్నీ అమూల్యమైనవి; అవి సమాజం పట్ల ఆయనకున్న మహత్తరమైన బాధ్యతకు, ఆయన ఆశించిన సాహిత్య, సాంఘిక ప్రయోజనానికి ప్రతిబింబాలు; అంతేగాక అవి విజయ ధ్వజాలు గూడ.

## పండిత కుటుంబం

అప్పారావుగారి ఇంటిపేరు గురజాడ. వెనుకట వారి పెద్దలు ఉండిన ఊరిపేరు గూడ గురజాడ. ఇది కృష్ణాజిల్లా గన్నవరం తాలూకాలోనిది. అప్పారావుగారి తాతగారి తండ్రి పట్టాభి రామయ్యగారు. పట్టాభి రామయ్య గారికి నలుగురు కొడుకులు. నలుగురిలో పెద్దవాడు సీతాపతి. ఆయనకు యిద్దరు కుమారులు. వీరిలో ప్రథముడు వెంకటరామదాసు. వెంకటరామదాసు

గారు తెలుగు, సంస్కృత భాషలలో పాండిత్యము కలవారు. తెలుగులో కవిత్వాన్ని వ్రాసేవారు. జ్యోతిశ్శాస్త్రము, వేదాంతాలలో వెంకటరామదాసు గారు ప్రవీణులు. వీరి బుద్ధికుశలతను మెచ్చి మచిలీపట్నం కలెక్టరు వీరికి విజయనగరం సంస్థానంలో ఉద్యోగం యిప్పించారు.

అదెంత శుభవేళ!

గొడవర్తి కృష్ణయ్య పంతులుగారు విశాఖపట్నం జిల్లా ఎలమంచిలి తాలూకా రాయవరం గ్రామస్థులు; ఎలమంచిలి మునసబు కోర్టులో సిరస్త దారుగా పనిచేసే వారు. వీరి కుమార్తె కౌసల్యమ్మ. కౌసల్యమ్మకు, గురజాడ వెంకటరామదాసుగారికి వివాహం జరిగింది. ఈ దంపతులకు రాయవరం గ్రామంలో దుందుభినామ సంవత్సర భాద్రపద శుద్ధ త్రయోదశి ఆదివారం నాడు అప్పారావుగారు జన్మించారు. తల్లి కౌసల్యమ్మ నవమాసాలు పూర్తిగా మోయకుండానే అప్పారావుగారు ఆవిర్భవించారు. అందువల్ల అది కొంత ఆందోళనకు కారణమైంది. కాని అదెంత శుభవేళ!

చదల చీకటి కదల బారెను
మేలుకొలుపులు కోడి కూసెను
విరులు కన్నులు విచ్చి చూసెను
ఉండి ఉడిగియు ఆకులాడగ
కొసరెనోయన గాలివీచెను

అప్పారావుగారి అవతరణకు నోచుకున్న ఆ శుభ దినము (సెప్టెంబరు 21, 1862) తెలుగు జాతి చరిత్రలో అక్షరమై నిలిచిపోతుంది. అదే 1862 వ సంవత్సరంలో మరిద్దరు మహనీయులు-తూర్పు భారతంలో విశ్వకవి రవీంద్రనాథ టాగోరు, ఉత్తర భారతంలో పండిత మోతీలాల్ నెహ్రూ— మనదేశంలో జన్మించారు.

గురజాడ వెంకటరామదాసు, కౌసల్యమ్మ దంపతులకు అప్పారావు గారి తరువాత పుట్టిన బిడ్డ శ్యామలరావు. శ్యామలరావు అన్నకు తగిన తమ్ముడు.

♦ ♦ ♦

## ఆనాటి పరిస్థితి

అప్పారావుగారు పుట్టింది 1862వ సంవత్సరంలో. అంతకు అయిదు సంవత్సరాల ముందు అంటే 1857 లో దేశం నలుమూలలా ఆంగ్లేయ ప్రభుత్వానికి వ్యతిరేకంగా ప్రథమ స్వాతంత్ర్య విప్లవ జ్వాలలు రగుల్కొన్నవి. అప్పుడు, తాత్కాలికంగా విప్లవం విఫలమైనా దేశంలో స్వతంత్ర భావానికి, అభిలాషకు బీజావాపన జరిగిందని చెప్పవచ్చు. స్వాతంత్ర్య ఉద్యమం వాసనలను, ప్రజలలో ప్రబలుతున్న అసంతృప్తిని ఆంగ్లేయ ప్రభుత్వం పసిగట్టింది. భారతదేశాన్ని యిక కంపెనీ పరిపాలించ లేదని విక్టోరియా మహారాణి ప్రభుత్వం గమనించింది. ఒక ప్రకటన ద్వారా ఇంగ్లండులోని విక్టోరియారాణి భారతదేశపు పరిపాలనా బాధ్యతలను కైవసం చేసుకొన్నది. అప్పటినుంచి భారతదేశం నేరుగా ఇంగ్లండు పరిపాలన క్రిందికి వచ్చేసింది. అప్పట్లో మనదేశంలో పై అంతస్తుల్లో ఉన్న పెద్దలు, కొంతవరకు సామాన్యులు గూడ విక్టోరియారాణి ప్రకటననే అభయ హస్తంగా భావించారు; ఇక శాంతి, సుస్థిరతలు ఏర్పడతాయనుకున్నారు. రైళ్ళు, మోటార్ల రాకతో మనదేశానికి ఆధునిక యాంత్రిక యుగంతో కొద్దిపాటి పరిచయం కలిగింది. బ్రిటిష్ ప్రభుత్వం ప్రసాదించే బిరుదులపైన ఒకవంక కొందరిలో మోజు మొదలయింది; ఈ మోజు దేశంలో ఒక విచిత్రమైన తరగతిని సృష్టించింది. అదే కాలంలో జాతీయ కాంగ్రెసు పరిమితమైన ఆశయాలతో ప్రారంభమయింది. అప్పుడు జాతీయ కాంగ్రెసును కొందరు యే విధంగా భావించుకొనేవారో గురజాడ మహాకవి వ్రాసిన 'కన్యాశుల్కం' నాటకంలోని గిరీశం మాటల్లో సవిస్తరంగా విశదం చేయబడింది. అప్పటికే

బెంగాల్‌లో బ్రహ్మసమాజం భావాలు పెద్దయెత్తున వ్యాపించినవి ; సాంఘిక సంస్కరణోద్యమం అక్కడ విజృంభించ సాగింది.

## ఉద్యమాల ఉధృతం

మన తెలుగు దేశం మీద గూడ ఈ రెండు ఉద్యమాల ప్రభావం ప్రసరించింది. దక్షిణ భారతదేశపు ఈశ్వర చంద్ర విద్యాసాగరులుగ ప్రఖ్యాతి పొందిన కందుకూరి వీరేశలింగంగారు మన సమాజంలోని దురాచారాలను, మూఢత్వాన్ని తొలగించడాని కొరకు, సాంఘిక సంస్కరణ కొరకు మహోద్యమాన్ని ప్రారంభించి నడుపుతున్నారు. సాహిత్యరంగం లోను కందుకూరి కాలు బెట్టాడు ; పత్రికలను ప్రారంభించి కందుకూరి సమాజంలోని దురాచారాలమీద దాడిచేయ సాగినాడు. స్త్రీవిద్య, బాల్యవివాహాలకు వ్యతిరేకత, వితంతు వివాహాలు, మూఢ నమ్మకాలను, ఆచారాలను ప్రతిఘటించడం వీరేశలింగంగారి ఉద్యమంలోని ప్రధాన భాగాలు. ఈ ఉద్యమంలో సనాతన మతాచార పరాయణుల తీవ్ర వ్యతిరేకతను వీరేశలింగంగారు తట్టుకొనవలసి వచ్చింది; విద్యార్థులు, యువకులు వీరేశలింగంగారికి అండగా నిలచేవారు. తమ ఉద్యమాన్ని ముందుకు తీసుకపోవడానికి కందుకూరి పత్రికలను నడిపి, పుస్తకాలను వ్రాయడమే గాకుండా బాలికాపాఠశాలలను, వితంతు శరణాలయాలను స్థాపించారు; అప్పటి పరిస్థితుల్లో అవి యెంతో విడ్డూరమైన విషయాలన్నమాట. నిశ్చయంగా కందుకూరి యుగపురుషుడని గురజాడ మహాకవి అన్నమాటలు నిక్కమైనవి.

ఆనాటి తెలుగుదేశం పరిస్థితులను అంతింతని చెప్పలేము. ఉరుములు, మెరుపులు వచ్చేముందు అలుముకొనే కారుమబ్బులు ఆనాడు అలుముకున్నవి. ఉషోదయం అయ్యేముందు కరడుగట్టె కాళరాత్రివలె ఆనాడు కటిక చీకట్లు అలుముకొన్నవి. ఉరిమింది; మెరపులు మెరసినవి; వెలుగు రేకలు వికసించినవి. ఈ మార్పుకు, యీ వెలుగుకు కారణం కందుకూరి, గురజాడ వంటి ఇద్దరు ముగ్గురు మహానుభావులు. అయితే యీ మార్పు రెండు

వాక్యాల్లో చెప్పినంత తొందరగా, అంత సులభంగా జరుగలేదు. ఆనాటి సాంఘిక రుగ్మతలకు, సామాజిక దురాచారాలకు, దురాగతాలకు, దుష్ట కృత్యాలకు చక్కని ప్రతిబింబం గురజాడ వ్రాసిన 'కన్యాశుల్కం' నాటకం. ఈ మూఢాచారాలు, నమ్మకాలు మన పరువు ప్రతిష్ఠలను మంట గలుపు తాయని, ఇదంతా సిగ్గుచేటని గురజాడ నిశితంగా విమర్శించాడు. పసిపాప లకు పెళ్ళిళ్లు చేయడం మొదలుకొని పిశాచాలను సీసాలలో పట్టడం వరకు విశ్వరూపం దాల్చిన మూఢత్వాన్ని నాటి మన సమాజం మూల్గుతూ మోయ వలసి వచ్చింది.

## తరువాత కథ

మన జీవితంలోని సంఘటనలనే ఇతివృత్తంగా తీసుకొని సుందర మైన, సహజమైన మన వాడుక భాషలో, ఆధునిక పద్ధతిలో ప్రయోజ నాత్మకమైన కావ్యరచన చేయాలన్న దృష్టి, తలంపు ఆనాడు ఎవ్వరికీలేదు. మన అదృష్టం కొద్దీ అటువంటి అభ్యుదయ దృష్టి కలిగిన ఒకరిద్దరు మేలుకొలుపు పాడితే 'ఛ ఛ' యివి పితూరీ ప్రేరేపకాలు, మన సంస్కృతి, సభ్యతలు మంట గలిసి పోతాయి' అన్న గగ్గోలాయె! అయితేనేం, వైతాళికులు విజయం పొందారు; అదే తరువాత కథ.

రకరకాల జబ్బులతో, దీర్ఘకాలిక రుగ్మతలతో, ఆంతరంగిక కల్మషాలతో లుకలుకలుగా ఉన్న శరీరం వంటిది నాటి సమాజం, అది రాలిపోయింది. ఆ వ్యవస్థ కూలిపోయింది.

ఆ పంకంలోనే పద్మాలు పుట్టి పరిమళాలను వెదజల్లినవి.

ఆనాడు మార్పు కొరకు, వెలుగు కొరకు జరిగిన జీవితసమరమే ఇప్పుడు చదువబోతున్న కథ—



## మరెవరో కాదు !

విజయనగరం క్లాక్‌టవర్ దగ్గర్లో పాత పుస్తకాలు అమ్మేచోట యెప్పుడూ ఒక పిల్లవాడు కన్పిస్తుంటాడు. ఆ పిల్లవాడు బక్కపలచనివాడు. అయినా అందమైనవాడు. కన్నుల్లో కాంతి ఉంది. అతనిలో చురుకుదనం ఎక్కువ. ఎంతో సీరియస్‌గా, కొనుక్కున్న ప్రతి పుస్తకాన్ని అక్కడే చదివేస్తుంటాడు. ఎన్ని పుస్తకాలు చదివినా పిల్లవాడికి తృప్తిలేనట్టుంది ; తనివి తీరని దాహం అది. ఇక్కడ యీ మైదానం లోను యీ పిల్లవాడే. ఇంతవరకు యెంతో ఏకాగ్రతతో పుస్తకాలు చదివినవాడు యిప్పుడు ఆటలకు తయారయినాడు. నవ్వుతూ, నవ్విస్తూ ఆటల్లో హుషారుగా ఉన్నాడు. ఈ పిల్లవాడు మరెవరోకాదు; చాలా మంది ఇతను పెరిగి పెద్దవాడై గొప్పవాడు కాగలడని ఊహించారు. అప్పారావుగారి చిన్నప్పటి నుండి ఆయన ముచ్చటలను కళ్ళారా తిలకించిన ఆ క్లాక్‌టవర్, ఆ మైదానం మూగవి కాకుంటె ఎంత బాగుండును !

## చిలిపితనం — చరిత్ర

చిన్నప్పటి నుండి అప్పారావు గారిది పరిశీలనాదృష్టి; క్రొత్తది యేది కనుపించినా దాని తత్వము తెలుసుకోవాలని ఆయనకు ఆసక్తిగా ఉండేది. అన్నిటిలోను ఆయనకు వింతలు పొడగట్టేవి. అయిదు సంవత్సరాల వయసులోనె అప్పారావుగారి విద్యాభ్యాసం మొదలయింది; గురివిందాడ గ్రామంలో వెలివెల రామమూర్తి పంతులుగారి వద్ద తెలుగు, సంస్కృతం, ఇంగ్లీషు పాఠాలు ప్రారంభమైనవి. ఏడు సంవత్సరాలు నిండీ నిండకముందే విజయనగరం సెకండరీ స్కూలులో, సంస్థానం వారి సహాయంతో, గురజాడకు పాఠశాల చదువు ప్రారంభమయింది. అక్కడే అప్పారావు గారికి గిడుగు రామమూర్తి పంతులు గారితో పరిచయం ఏర్పడింది. తరువాత తరువాత జీవిత రంగంలో, తెలుగు వాఙ్మయ రంగంలో గురజాడ అప్పారావుగారు, గిడుగు రామమూర్తిగారు కలిసి చేసిన మహత్తర కార్యాలు,

సాధించిన ఘన విజయాలు, ప్రజలభాషకు, ప్రజల భావాలకు సాహిత్య గౌరవాన్ని సంపాదించడానికి వారిద్దరు కలిసి చేసిన సేవలు ఒక పెద్ద చరిత్రాత్మక గాథ. ఈ గాథకు అంకురార్పణ చిన్నప్పటి ఆ చిలిపితనంలోనే జరిగింది. చిన్నతనం నుండి హాస్యం అప్పారావుగారి సహజగుణం. ఒకసారి క్లాసులో చిలిపి పనులు చేస్తే అప్పారావుగారి పిలకను రామమూర్తిగారి పిలకతో ముడివేసి యిద్దరిని బెంచిమీద చెరొక చివరన కూర్చుండబెట్టారు. అప్పారావుగారి ప్రకృతిలో చిన్నప్పటినుండి భయమన్నది లేదు; చిత్తం, చిత్తం అనే బానిస భావాలన్నా, రహస్యాలన్నా ఆయనకు నచ్చకపొయ్యేవి. బాల్యంనుండే గురజాడ ప్రకృతి దృశ్యాలను, పల్లె జీవితాన్ని తనివితీరా పరిశీలించేవాడు. ఒక వైపున పుస్తకాలను విరామం లేకుండా చదువుతూ, వాటితో గాఢ స్నేహం చేస్తూనే మరొక వైపున తోలుబొమ్మలాటలు, వీధి భాగవతాలు అంటే యెంతో యిష్టపడేవాడు. సూర్యుడు ఉదయించక ముందే నిద్రనుండి లేచి వేపపుల్లతో ముఖం కడుక్కొని గురజాడ పుస్తక పఠనం ప్రారంభించేవాడు. పెద్ద పెరిగిన తరువాత గూడ గురజాడకు పండ్లపుల్లలు లేకుంటే దాటక పోయేది.

## అతని వ్యసనం

1872 లో, అంటే పది సంవత్సరాల వయసులో అప్పారావుగారు విజయనగరం మహారాజావారి ఆంగ్లకళాశాల ఉన్నత పాఠశాలలో ప్రవేశించారు. మెట్రిక్యులేషన్ చదువుతున్నప్పుడు అప్పారావుగారు ఆంగ్లంలో వ్రాసిన 'కోకిల' అనే గీతాన్ని చదివి అప్పుడు స్కూళ్ళ ఇన్స్పెక్టరుగా వున్న నాగోజీరావుగారు ఆనందం పట్టలేక పొయ్యారు; ఆ గీతాన్ని ఆయన ఆనందగజపతి మహారాజా వారికి వినిపించారు. ఆ గీతం ఆనందగజపతి మనసును ఎంతగానో ఆకర్షించింది. అప్పారావుగారి బుద్ధికుశలతను చూసి కళాశాల ప్రిన్సిపాల్ సి. చంద్రశేఖరశాస్త్రిగారు ఆయనను తమ యింటనే ఉంచుకొని భాషా సారస్వతాలను బోధిస్తూ

గట్టి పాండిత్యం కలుగునట్లు శిక్షణ యిచ్చారు. చంద్రశేఖర శాస్త్రిగారు విద్యాధికులు. తమ వద్ద విద్యార్థిగా ఉన్న అప్పారావు గారిని గురించి ఆయన యీ విధంగా అన్నారు— "అఖండ మేధా సంపత్తి గల కొద్దిమంది విద్యార్థుల్లో అప్పారావు ఒకడు. విద్యార్థిగా ఉంటూ గురువుల మన్ననలను పొందిన యువకుడు. నిరంతర సాహిత్య వ్యాసంగం అతని వ్యసనం. సహజ ప్రేరేపణ వలన కలిగిన అతని కవితాశక్తి అపారమైనది. సాధన వల్ల అది ప్రకాశవంతమై, ఎప్పటికిని మనం మరువలేని కవుల స్థానాన్ని అప్పారావుకు ప్రసాదిస్తుంది. వినయం, సౌశీల్యం అతని సహజ గుణాలు .. . " విద్యార్థిగా ఉన్న అప్పారావు గారిని గురించి ఆయన ప్రిన్సిపాల్ చెప్పిన మాటలు అక్షరాలా నిజమైనవి; ప్రిన్సిపాల్ గారి కలలు ఫలించినవి.

## అనుకూలించని ఆర్థిక స్థితి

అప్పారావు గారు మెట్రిక్యులేషన్ పరీక్ష ప్రథమశ్రేణిలో ఉత్తీర్ణులయినారు. న్యాయశాస్త్రం చదివి న్యాయవాదిగా రాణించ వలెనని, ప్రసిద్ధి పొందవలెనని అప్పారావుగారి అభిలాష. కాని ఆర్థిక పరిస్థితులు అనుకూలించలేదు. పట్టభద్రుడు కాక ముందే అనగా డిగ్రీ పరీక్ష అయినా పూర్తి కాక ముందే 1884 వ సంవత్సరం ఏప్రిల్ 1వ తేదీన అప్పారావుగారు నెలకు ఇరవై అయిదు రూపాయల జీతం మీద హైస్కూలులో ఉపాధ్యాయుడుగా ప్రవేశించారు.

## ప్రచండులతో పరిచయం

ఉపాధ్యాయ వృత్తిలో ప్రవేశించక ముందు, విద్యార్థిగా ఉంటున్న సమయంలోనె అప్పారావుగారి జీవితంలో ఒక ముఖ్యమైన సంఘటన జరిగింది; 1883 వ సంవత్సరంలో, ఇరవై ఒకటవయేట అప్పారావు గారికి డాక్టర్ శంభుచంద్ర ముఖర్జీతో పరిచయం యేర్పడింది. డాక్టర్ శంభుచంద్ర

ముఖర్జీ కొంతకాలం త్రిపుర సంస్థానానికి దివాను; 1885 లో 'ది ముఖర్జీ మేగజైన్'ను స్థాపించి, కొంతకాలం తరువాత 'రీస్ అండ్ రయత్'గా దానిపేరు మార్చి పత్రికా సంపాదకుడుగా, ఆంగ్లభాషా పండితుడుగా ప్రసిద్ధి కెక్కాడు. ఆంగ్లేయుల రచనలలోనె తప్పులు పట్టగలిగిన పాండిత్యం ఉన్నవాడు శంభుచంద్ర ముఖర్జీ; ఆయన పత్రికలో విమర్శ అంటే గవర్నరు జనరల్ గూడ భయపడేవాడు. అప్పారావుగారు విద్యార్థిగా ఉంటూ ఆంగ్లంలో వ్రాసిన 'సారంగధర' పద్యాలను వెంకటరమణయ్య అనేవారు తమ ఆంగ్లపత్రికలో ప్రకటించి, తిరిగి ప్రచురించడాని కొరకు వాటిని డాక్టర్ ముఖర్జీకి పంపించారు. అప్పుడు శ్రీ ముఖర్జీ రమణయ్య గారికి వ్రాసిన ఒక లేఖలో— 'సారంగధర' నిజంగా చెప్పుకో దగిన కల్పన. కవికి ఎంతో గొప్ప భవిష్యత్తు ఉందని అది రుజువు చేస్తున్నది.........

అందువల్ల ప్రాధాన్యమిచ్చి మా పత్రికలో ప్రచురించా లనుకుంటున్నాను. ఆ యువరచయితను అందరికీ ఎరుక పరచి ప్రోత్సహించాలనుకున్నాను. ఉత్తమశ్రేణికి చెందిన సాహిత్య, రాజకీయ పత్రికలో ఒక పద్య కావ్యం ప్రచురించడం సాధారణమైన విషయం కాదు .... ఒక భారతీయుడు ఇంగ్లీషులో రచించిన ఈ పద్యాలను లోకం ఏ విధంగా స్వీకరించగలదో తెలుసుకొన వలెనని ఆసక్తిగా ఉంటుంది........అతనికి శక్తి సామర్థ్యాలున్నాయి. అతని పేరు, వయస్సు, చదువు, కావించిన కృషి అన్ని వివరాలు తెలుసుకొనుటకు నాకు కుతూహలంగా ఉన్నది"—అని అప్పారావు గారి ప్రజ్ఞను ప్రస్తుతించారు. ఇంటరు చదువుతున్న సమయంలో అప్పారావు గారికి ముఖర్జీగారికి మధ్య వివిధ విషయాల మీద జిజ్ఞాసా పూర్వకమైన ఉత్తర ప్రత్యుత్తరాలు జరుగుతుండేవి. ఆ ఉత్తరాలన్నీ మనకు దొరుకలేదు. 1884 జనవరి 27 నాటి ఒక ఉత్తరంలో ముఖర్జీగారు వ్రాసిన మాటలు గమనించదగినవి—"మీరు మదరాసులో ఎంతకాలం ఉంటారు ? అక్కడి సమాజం గురించి, మీ పరీక్షలను గురించి అన్ని వివరాలు నాకు వ్రాయండి....అక్కడి సాంఘిక, రాజకీయోద్యమాలను గురించి నాకు తెలుసు

కోవాలని ఉన్నది. వితంతు వివాహ సమస్య ఏ విధంగా ఉన్నది? ఈ సమస్య పట్ల అక్కడివారి అభిప్రాయా లేమిటి? వితంతు వివాహాలు కూడవని వాదించే వారి హంగామాను హర్షిస్తున్నారా ?....ఈ మధ్య విజయ నగరం నుంచి యిక్కడికి కొందరు వచ్చారు. 'ఆయన సభ'లో ఉన్న (బహుశ ఆనందగజపతి సభ) నవరత్నముల వంటి పండితులలోను అతి ప్రకాశవంతమైన రత్నమనదగిన మీరు గూడా రాగలరని నేను ఆశించాను. కాని మీరు రాలేదు... మీరు వ్రాద్దామనుకొన్న రాజకీయ పద్యకావ్యాన్ని ప్రారంభించారా ? జానపద గేయాలు, వివిధ ఛందస్సులలో పద్యాలు వ్రాయడానికి ఉపక్రమించండి." ఇరవై రెండు సంవత్సరాలు గూడా పూర్తిగాని ఒక యువ మేధావితో, కవితో, రచయితతో వయసులో, విజ్ఞానంలో వృద్ధులైన వారొకరు జరిపిన యీ ఉత్తర ప్రత్యుత్తరాలు మనకు ఆశ్చర్యాన్ని గొలిపే సంగతులను బయట పెడుతున్నవి. అంత చిన్న వయస్సులోనే అప్పారావుగారు రాజకీయ పద్యకావ్యాన్ని వ్రాద్దామని అనుకొన్నారన్నమాట; వ్రాసినారేమో! మనకు దొరుక లేదు. ఏన్నో, అప్పారావుగారు కన్న కలలు!

## చురుకుదనం హెచ్చు

శంభు చంద్ర ముఖర్జీ గారితో అప్పారావుగారు ఉత్తరప్రత్యుత్తరాలను ఇక యెక్కువ రోజులు కొనసాగించ లేకపోయారు. దీనికి ప్రధానమైన కారణం అప్పారావుగారికి ఆర్థికంగా చిక్కులు రావడం, తద్వారా మనశ్శాంతి లేక పోవడం. ఉపాధ్యాయుడుగా పని చేస్తున్నప్పుడు అప్పారావుగారికి దొరికినవి నెలకు పాతిక రూపాయలు మాత్రమే. అందువల్ల యేదైన పెద్ద ఉద్యోగానికి ప్రయత్నం చేయా లనుకున్నారు. అప్పటికే, అంటే జనవరి 1886 నాటికి ఇంగ్లీషులో, సంస్కృతం రెండవ భాషగా, తత్వశాస్త్రం అభిమాన విషయంగా అప్పారావుగారు ప్రథమశ్రేణిలో బి. ఏ. పూర్తిచేశారు. బి. ఏ. పరీక్షతో ఆయనకు పరీక్షల బెడద వదలి పోయింది. పరిశీలనా దృక్పథంతో

పుస్తకాలను పఠించి, సొంతంగా ఆలోచించి తమ అభిప్రాయాలను విమర్శ నలతో సహా ప్రకటించే అలవాటు అప్పారావు గారిది. మరి పరీక్షల్లో పాసు కావడానికి యీ పద్ధతి పనికిరాదుగదా ! అందువల్లనే ఒకసారి అప్పారావు గారు బి.ఏ. పరీక్షలో ఫెయిల్‌కాగా ఆయన స్నేహితు డొకతను, "అప్పా రావు ! నువ్వు మా అందరికన్న చురుకుదనం యెక్కువున్న వాడివిగదా, పరీక్షలో యెందుకు పాసుకాలేదు" అని ప్రశ్నిస్తే, "మనలో చురుకు పాలు హెచ్చయిందోయ్" అని అప్పారావుగారు చమత్కారంగా జవాబిచ్చారు. అంతేగాక, "పరీక్షలంటే లేనిపోని బెడద, చికాకు, ప్రాణాంతకం. ఇవి యెంత బాధాకరమైన వంటే పరీక్షలు పాసయామని చెవిని పడీపడగానె తమ నెత్తికెత్తిన బరువు దింపుకున్నట్లు యువకులు భావిస్తారు. వాళ్ళ ప్రాణాలు తెరిపిన పడతాయి. పరీక్షలంటే నాకు పరమ అసహ్యం—" అని సైతం అప్పారావు గారు అన్నారు.

విజయీభవ....

బి. ఏ. పాసయిన తరువాత ఒక సంవత్సరానికి అప్పారావుగారు మూడు సంవత్సరాల నుండి పనిచేస్తున్న ఉపాధ్యాయ పదవిని వదలిపెట్టి విజయనగరం జనరల్ డిప్యూటి కలెక్టరు కచేరీలో సబ్రోటు హెడ్‌గుమాస్తాగా 1887 మార్చి 3వ తేదీన చేరారు. ఇదీ ఆయన మనసుకు నచ్చలేదు. అప్పారావుగారి విజ్ఞానం, మేధస్సు, అడవిగాచిన వెన్నెల కాగూడదని ఆనందగజపతివారు అనుకున్నారు. అనుకున్నదే తడవుగ ఆయన స్వయంగా కలెక్టరు కచేరికి బయలుదేరి అప్పారావుగారిని గుమాస్తా ఉద్యోగం నుండి విరమింప జేసారు; తమ కళాశాలలోనె నెలకు నూరు రూపాయల జీతంతో ఆనందగజపతి అప్పారావుగారిని నాలుగవ అసిస్టెంట్ లెక్చరర్‌గా నియ మించారు. ఇది జరిగింది 1887 వ సంవత్సరం విజయ దశమినాడు.

అప్పారావుగారు కలెక్టరు కచేరీలో పనిచేసింది కొన్ని నెలలు మాత్రమే. ఈ ఉద్యోగం విరమించి కళాశాలలో చేరుతున్నప్పుడు కలెక్టరు

రావు బహద్దుర్ వి. జగన్నాథరావుగారు అన్నమాటలు పరికించవలసినవి—
"అప్పారావు మంచి పండితుడు, కవి. మానవ ప్రవృత్తిని పరిశీలించడ
ములో నిపుణుడు. సంస్కృతము చక్కగా వచ్చును. ఆయన పాండిత్య
మును, హైస్కూలులో ఉపాధ్యాయునిగా ఆయన గడించిన కీర్తిని గమ
నించి ఈ ఉద్యోగమునకు ఆయన అర్హుడని భావించాను. నావద్ద ఆయన
ఎనిమిది నెలలు పనిచేశారు. వారి ప్రతిభా విశేషములు మహారాజావారి
దృష్టిని ఆకర్షించ గలిగినందుకు సంతోషం."

## విపత్తులలో వినోదం

1887 విజయ దశమి నాటితో అప్పారావుగారి జీవితంలో క్రొత్త
ఘట్టం ప్రారంభమయింది. అప్పారావు గారి జీవితంలో ఇది ఒక మైలురాయి,
ఒక మలుపు. కళాశాలలో చదువుకొనడానికి చేరిన తరువాత యెదురయిన
కష్టాలు యీనాటితో తొలగిపోయినవి. వెనుకటి రోజులను తలచుకుంటె
హృదయం బరువెక్కుతుంది, గుండె దస్సుమంటుంది అప్పారావుగారికి —
"ఒకే ఒక వ్యక్తి రెక్కలమీద కుటుంబమంతా ఆధారపడినప్పుడు కలిగే
బాధలు మిక్కుటము. తెలివితేటలు ఉండి ముందు ముందు రాణించవలసిన
యువకులు డబ్బులేనందువల్లనో, మరెందు చేతనో చదువు మానుకుంటు
న్నారు. ఆ రోజులలో డబ్బులేక పోవడము వల్ల చిక్కులు తటస్థించినవి.
ఆ దుర్దినాలు గడచి పోయినవి. నా చదువు పూర్తి అయింది. మనిషికి
చీకూ చింతా లేనప్పుడే సుఖం. ఎవరికి వారు స్వతంత్రంగా జీవించుట అవ
సరము ... ...ఆహా! ఆ రోజులు మళ్ళీ వస్తే ఎంత బాగుండునో కదా!
ఇంత కాల మయిపోయిన తరువాత వాటిని తలచుకుంటె ఎంత మనోహరంగా
ఉన్నవి! కాని ఆ గతించిన రోజులు కష్టాలతో నాకెంతో వ్యధను కలిగిం
చినవి; హృదయానికి మోయలేని భార మనిపించినవి. నిజంగా అవి ఎంతో
భారం! చెప్పలేనంత భారం! అంతో యింతో సంపన్నవంతుడ నయేవరకు
నా కష్టాలు గట్టెక్కినవి కావు. నా చిన్ననాటి రోజులు తిరిగి రావలెననే

కోరిక యిక నాకు లేదు. ఎప్పుడూ ఏదో వొక దిగులు; డబ్బులేక పోవడం వలన ఎన్నెన్ని చిక్కులు! ఆ దుర్దినాలు వెళ్ళి పోయినవి; వెళ్ళిపోయినవి! పూర్తిగా మటు మాయమై పోయినవి! అమ్మయ్య! ఎట్టి విపత్తు! అయితే నేమి! ఆ రోజులలో నాకు ఆనందం లేక పోలేదు. రోజులు మంచి ఉత్సాహంతో గడిపాను. తెల్లవారితే దినం యే విధంగా గడుస్తుందనే చీకూ చింతా లేనప్పుడే మనిషికి ప్రశాంతి, సుఖమూనూ. ఒకరి సంపాదన మీద ఆధార పడ్డ మనిషికి యే అనుభవమూ ఉండదు." విపత్తులలో వినోదాన్ని, కష్టాల్లో ఆనందాన్ని, చెడ్డలోనె మంచిని లోతుల వరకు వెళ్ళి అందుకోవడం అప్పారావు గారి ప్రత్యేకత.

## పనే పరమావధి

సమస్యలంటే అప్పారావుగారికి భయం లేదు. "జీవితంలో సమస్యలు వచ్చినప్పుడు వాటిని ఎదుర్కోవడమంటే కొందరికి భయం. వాటిని తప్పించుకొని తిరిగినంత మాత్రాన అవి తొలగిపోవు. కష్టాలను ధైర్యంతో ఎదుర్కొన్నప్పుడు ఆనందం కలుగుతుంది." పరిస్థితులు ఎంత క్లిష్టంగా ఉన్నప్పటికి ఆయన వాటికి బానిసకాడు— "మానవుడు పరిస్థితులకు కేవలం బానిస అని, తన ప్రవర్తనను తాను నిశ్చయించుకోలేని నిస్సహాయుడని అనుకోవడం పొరపాటు. శారీరిక, మానసిక ధర్మమును నిర్ణయించడంలో అనువంశిక, పరిసరాల ప్రభావాలు అధికంగా ఉన్నా వాటిని మానవుని మేధాశక్తి సరిదిద్ద గలుగుతుంది. మానవునికి కావలసింది సంకల్పబలం." ఆ సంకల్పబలం అప్పారావుగారిలో అధికంగా ఉన్నది. తన సంకల్ప సిద్ధి కొరకు దృఢంగా పనిచేయడమే ఆయన పరమావధి— "పనిమీదనే నాకు ధ్యానం, పరిపూర్ణ విశ్వాసం. పనీ పాటూ లేకుండా బాగుపడాలనుకొనే వాళ్ళమీద నాకు సానుభూతి ఉండదు. నిరంతరం పనిచేయడం నా కొక అలవాటు. పనికి పనే పరమావధి—ఫలితం మాట తరువాత"

## పెళ్లి — ప్రశాంతి

మహారాజా కళాశాలలో నాలుగవ లెక్చరర్‌గా నియమించబడిన తరువాత అప్పారావు గారికి యెంతో మనశ్శాంతి కలిగింది. ఈ ఉద్యోగంలో జీతం నెలకు నూరురూపాయలు. ఎఫ్. ఏ., బి. ఏ. తరగతుల విద్యార్థులకు అప్పారావుగారు తత్వశాస్త్రం, ఆంగ్లం, సంస్కృత సాహిత్య చరిత్రం, అనువాదం, వ్యాకరణం, గ్రీకు, రోమను చరిత్రలను బోధించేవారు. కళాశాలలో అధ్యాపకత్వం నిర్వహిస్తూనే తీరిక సమయాల్లో ఆనందగజపతి వారికి వార్తా పత్రికలను చదివి వినిపించేవారు. ఇందుకు తమ సొంత డబ్బు నుండి నెలకు యేబది రూపాయలను ఆనందగజపతి అప్పారావుగారికి యిచ్చేవారు. కళాశాలలో ప్రవేశముతో 1887 నుండి ఆనందగజపతి వారికి అప్పారావు గారికి మధ్య స్నేహం సుదృఢం కాసాగింది. ఈ స్నేహం సన్నిహితత్వంగా మారి యిద్దరి హృదయాలు పెనవేసుకొన్నవి. అప్పారావుగారికి 1891 లో పాతిక రూపాయల హెచ్చింపుతో మూడవ లెక్చరర్‌గా ప్రమోషన్ దొరికింది. కళాశాలలో నాలుగవ లెక్చరర్‌గా నియుక్తులయ్యే నాటికి అప్పారావుగారి వయస్సు పాతిక సంవత్సరాలు మాత్రమే. బి. ఏ. పూర్తి చేసిన తరువాత అప్పారావు గారికి వివాహం జరిగింది. అత్తవారి ఊరు కొత్తవలస సమీపంలో ఉన్న దేవరాపల్లి. మామగారు ఎల్లాప్రగడ సన్యాసిరాజుగారు. సన్యాసిరాజుగారికి ముగ్గురు కుమారులు, ముగ్గురు కుమార్తెలు: పెద్ద కుమార్తె పేరు అప్పల నరసమ్మగారు; ఆమె అప్పారావుగారి సతీమణి.

## అధ్యయనం — ఆలోచన

1887 నుండి 1896 జూలై 5 వ తేదీవరకు దాదాపు తొమ్మిది సంవత్సరాలు అప్పారావుగారు అధ్యాపక పదవిలో పనిచేశారు. ఈ తొమ్మిగి సంవత్సరాల కాలం అప్పారావుగారి జీవితంలో అత్యంత ప్రధానమైనది; ఇది నిర్ణయాత్మక మైనట్టి కాలం. కళాశాలలో అప్పారావుగారి పని చదువు

చెప్పడమైనా దానితోపాటు ఆయనగూడ అంతులేకుండా చదువుకున్నారు. ఆయన చదువుకు పరిమితి లేదు. హద్దులు లేవు. అధ్యయనం, ఆలోచన అప్పారావు గారికి శ్వాసవంటివి. క్లాసులకు పాఠాలను చెప్పడానికి వెళ్ళితే పాఠ్యభాగాన్ని, దానికి సంబంధించిన అనేక అంశాలను ఆయన క్షుణ్ణంగా చదివి నోట్సుతో సహా తయారయేవారు. ఊరికే క్లాసుకు వెళ్లి ఆషామాషి కబుర్లు చెప్పి మొక్కుబడి చెల్లించడమంటే ఆయనకు గిట్టదు. చేసేపనిని సమగ్రంగా చేయడం, ఆ పనిలో పరిశీలనలు, పరిశోధనలు జరుపడం, క్రొత్తమార్గాలు త్రొక్కడం ఆయన వ్యక్తిత్వంలోని ప్రత్యేక తత్వం. విద్యార్థులకు బోధిస్తున్న పాఠ్యభాగాలను గురించి, పద్ధతులను గురించి మదరాసు బెంగుళూరు, కలకత్తా, బొంబాయి తదితర ప్రాంతాలలో ఉన్న విద్యావేత్తలతో స్వయంగా వెళ్లి వివరంగా చర్చించేవారు; లేఖలు వ్రాసి చర్చలు జరిపేవారు. దేశదేశాల విద్యావిధానాలను, విద్యా ప్రణాళికలను అదేపనిగా పరిశీలించేవారు; ఈ సందర్భంలో కెల్లెటు, బెయిట్ మొదలయిన విద్యావేత్తలతో అప్పారావుగారు జరిపిన సంభాషణలను ఉదహరించవచ్చు క్లాసులో పాఠాలు చెప్పే తీరును సైతం ఒక కళగా భావించి అప్పారావు గారు అందులో ప్రయోగాలు చేశారు. అప్పారావుగారు మంచి వక్త; గంభీరమూ, మృదులమూ అయిన కంఠంతో సభారంజకంగా ఆయన ఉపన్యాసాలను యిచ్చేవారు; విషయ సంపన్నమై చక్కని శైలితో ఆయన ఉపన్యాసాలు భాసించేవి,

## వాఙ్మయ వీథుల్లో విహారం

అప్పారావుగారి అధ్యయనం, గ్రంథ పఠనం పగ్గాలు లేకుండా పరుగులతో విజృంభించింది. సంస్కృతం, తెలుగు కావ్యాలు, విమర్శలు, ఇంగ్లీషు తదితర పాశ్చాత్యభాషల సారస్వతం, సాహిత్యం అనేకంగా అప్పారావుగారు పఠించారు. పఠించేటప్పుడు పుస్తకాలలోనె నోట్సు వ్రాసేవారు. మన దురదృష్టం కొద్దీ అప్పారావుగారి గ్రంథాలయం చెల్లా చెదరై

పోయింది. లేకుంటే అప్పారావుగారి విమర్శనాత్మక అభిప్రాయాలు, ఆయన భావ సంపద యింకెన్నో, యింకెంతో మనకు దొరికి ఉండేవి. కాళిదాసు శాకుంతలం చదువుతూ అప్పారావుగారు వ్రాసిన నోట్స్- తిక్కన విరాటపర్వం అధ్యయనం చేస్తూ వ్రాసిన వ్యాఖ్యలు అమూల్యమైనవి. అప్పారావుగారి బక్క పలచటి శరీరం విజయనగరంలో ఉన్నా ఆయన మేధస్సు యూరప్ వాఙ్మయ వీథుల్లో విహరించి వచ్చింది. వివిధ భాషల సాహిత్యాన్ని, ఆయా భాషలలోని ఏపు తెన్నులను, వివిధ భాషలలో, సాహిత్య రంగాలలో వచ్చిన, వస్తున్న మార్పులను అప్పారావుగారు అపార గ్రంథపఠనం వల్ల తమ మస్తిష్కం లోనికి గ్రహించ గలిగారు.

## అంత సులభమా!

అధ్యయనం ఒక వంక. మరొకవంక విద్వత్తు వెల్లివిరిసే విజ్ఞాన నిధులైన స్నేహితులతో అనేక విషయాలపై గోష్ఠులు, చర్చలు. అప్పా రావుగారి స్నేహితులందరూ ఏదో ఒక రంగంలో నిష్ణాతులైనవారే, గొప్ప వారే. అప్పారావుగారే అన్నారు—"నా అదృష్టం యెట్టిదో కాని నాకు పరి చయం కలిగే ప్రతిమనిషి వేలలో యెన్నదగిన వాడై ఉంటాడు, కోట్లలో యెన్నదగిన వాడై ఉంటాడు." ఆనంద గజపతి స్వయంగా అనేక భాష లను నేర్చిన పండితుడు, కళాకోవిదుడు. ఆయన ఆస్థానంలో ఉన్న వారం దరు అతిరథ మహారథులే, హేమా హేమీలే. శంభు చంద్ర ముఖర్జీ అన్నట్లు అంతా రత్నాల వంటివారు. లింగం లక్ష్మాజీ పంతులుగారు గ్రీకు, లాటిన్, ఫ్రెంచి, ఇంగ్లీషు, సంస్కృతం, తెలుగు భాషలలో గొప్పపండితుడు; అఖండ ప్రతిభాశాలి. ఆదిభట్ల నారాయణదాసుగారు హరికథా పితామహుడు. కిళాంబి రామానుజాచార్యులవారు న్యాయవాదిగా, విద్యావేత్తగా రాణించి ప్రిన్సి పాల్‌గా ఉన్నవారు. గోమఠం శ్రీనివాసాచార్యులవారు ఆంగ్లంలో 'హరి శ్చంద్ర' నాటకాన్ని రచించి, స్వయంగా ప్రదర్శించి ప్రశంసలను పొందిన నటకావతంసులు. వీరుగాక అనాసపురపు రామమూర్తి, యనమండ్ర నారా

యణమూర్తి, జిద్దు సుందరరావు ప్రభృత పండితులు ఉండనే ఉన్నారు. వీరందరి మధ్య అందరికంటె ప్రకాశవంతమైన రత్నం వలె అప్పారావు గారు అత్యున్నత స్థానాన్ని పొందడం అంత సులభమైన కార్యమా ! అది నిర్విరామమైన, నిశ్చలమైన తపస్సు ఫలితం. వీరందరు ఆనందగజపతి ఆస్థానంలోని స్నేహితులు. ఇక బయటికి వెళ్ళితే గిడుగు రామమూర్తిగారు చిన్నప్పటినుండి ప్రియమిత్రులు. గిడుగు పిడుగును గురించి చెప్పవలసిన పని లేదు; అయన అంటే పెద్దపెద్ద పండితులు గూడ హడలిపోయేవారు; మరి ఆయన వాగనుశాసనుడు, అంటే వాక్కును–భాషను–శాసించిన వాడే గదా ! శ్రీనివాస అయ్యంగార్ మదరాసు హైకోర్టులో అడ్వకేట్ జనరల్, గొప్ప షేక్స్పియరియన్ పండితుడు. ఈయన అప్పారావుగారికి చాల సన్నిహితుడు. వై. ఏ. ఏట్స్ ఆంగ్ల విద్యాధికుడు, మదరాసులోని పచ్చయప్ప కళాశాల ప్రిన్సిపాల్; ఏట్స్ అప్పారావుగారికి యెప్పుడూ అండగా నిలచిన వాడు. వేదం వేంకటరాయ శాస్త్రిగారు మొదలైన పండితులు, సాహిత్య వేత్తలు అప్పారావుగారి మిత్ర బృందంలో చేరినవారే. కలకత్తా, బెంగుళూరు నగరాలలోను అప్పారావుగారికి సాహిత్య బంధువులు యెందరో వుండేవారు. వీరితో ఉత్తరాల ద్వారా సాహిత్య విషయాలను ముచ్చటించే వారు.

## వెన్నతో బెట్టినవిద్య

ఆనంద గజపతి ఆస్థానంలో డిబేటింగ్ క్లబ్–చర్చా వేదిక–యేర్పడింది. దానికి అప్పారావుగారు ఉపాధ్యక్షులు. డిబేటింగ్ క్లబ్‌లో ఎన్నో విషయాలమీద చర్చలు జరిగేవి. ఆనందగజపతి వారికి పరిపాలనలో కంటె పండిత గోష్ఠిలోనే ప్రీతి హెచ్చు. అందువల్ల ఆయన ఆస్థానంలో యెప్పుడూ యేదో ఒక విషయం మీద మీమాంస, చర్చ జరుగుచుండేది. వీటన్నింటిలోను అప్పారావుగారు ప్రముఖులు. పట్టణంలో కాంగ్రెసు సమావేశాలు జరిగితే అందులోను అప్పారావుగారి ఉపన్యాసా లుండేవి. ఆనంద

గజపతివారు క్షామ నివారణ సంఘాన్ని యేర్పాటు చేస్తే అందులోను అప్పారావుగారు సభ్యులు. ఇన్ని విస్తృత కార్యక్రమాల్లో నెగ్గుకు రావాలంటే యెప్పటి కప్పుడు బుద్ధికి పదును పెట్టడం అవసరం. అది అప్పారావుగారికి వెన్నతో బెట్టిన విద్య.

## కొత్తకొత్త అనుభవాలు

వీటన్నింటికి తోడు ఆనందగజపతి వారితో మద్రాసు, బనారసు, బెంగుళూరు మొదలైన అనేక ప్రాంతాలకు ప్రయాణాలు చేయవలసి వచ్చేది. ఆనంద గజపతితో గడిపిన కాలంలో వివిధ విషయాలను, సంఘటనలను, రకరకాల మనుష్యులను, భిన్నప్రవృత్తులను విశ్లేషించి చూసి మంచి చెడులను దేనికది విడదీసి, విభాగించి, వివరంగా పరిశీలించే అవకాశం అప్పారావుగారికి లభ్యమయింది. ఆయన దృష్టిలో పడని విషయ ముండదు; నిశితమైన ఆయన చూపుల నుండి తప్పించుకొనే వస్తువుండదు. అందువల్లనే ఆనందగజపతి సోదరి రీవా మహారాణి ఒకసారి అప్పారావుగారి ప్రతిభను గురించి యీ విధంగా హెచ్చరించింది— "అప్పారావు చూస్తూ వుండగా వ్రాయకు. దూరం నుంచే, యేమి వ్రాస్తావో నీ కలం తిరుగుడులు బట్టి తెలుసుకుంటాడు." అప్పారావు గారికి యెప్పుడూ ఆలోచనలే— "భావించడం నా ముచ్చట. ఆలోచన నా బలం. ఏదో ఒక దానిని దృష్టిలో పెట్టుకొని, ఎడతెరిపి లేకుండా, ఆ రోజుల్లో సరదాగా ఊహించే వాణ్ణి. పచారు చేస్తున్నప్పుడు, నడిచి వెడుతున్నప్పుడు, ఏకాంతంగా వున్నప్పుడు, భోజనం చేస్తున్నప్పుడు, పరుపుమీద వాలినప్పుడు, నగం రాత్రి మెలకువ వచ్చినప్పుడు- ప్రొద్దున్న షికారు వెళ్ళినప్పుడు, అప్పుడూ యిప్పుడూ అననేల; ఎప్పుడు ఏదేదో ఊహించేవాణ్ణి; ఏమేమో భావించే వాణ్ణి. మధుర స్వప్నాలతో కొన్నాళ్ళు, కొన్నేళ్ళు గడచి పోయినవి. ఆలోచనలను ఊరికే పరుగులెత్తించడం మంచిదికాదు. అందులో ఆనందమున్నా మేధస్సుకు శ్రమ; నరాలకు బలహీనత. ఇప్పుడిప్పుడు ఎక్కువసేపు ఆలోచించకుండా

ప్రయత్నిస్తున్నాను. కాని యెంత పొదుపుగా ఉందామన్నా నాకు ఆలోచనలు లావు!'' తెలిసి ఉండే అప్పారావుగారు లఘాయిత్యం చేశారు. మేధస్సుకు అహర్నిశలు శ్రమ కలిగించడం వలన ఆయన ఆరోగ్యం సన్నగిల్లింది. నరాల బలహీనత యేర్పడింది. ఈ కొద్ది సంవత్సరాల్లోనె అప్పారావుగారిలో చాల మార్పు వచ్చింది. అది ఆయనే గ్రహించారు–"నిజానికి గత ఆరేడు సంవత్సరాల్లో కొత్త కొత్త అనుభవాలు కలిగి జీవిత పరిజ్ఞానం అధిక మయింది. జీవిత అనుభవాలు, వైవిధ్యం, అనుభూతులు నాకొక నూతన దృష్టిని కలిగించినవి. ఇష్టం లేనప్పుడు, అసంతృప్తి కలిగినప్పుడు, ద్వేషము పుట్టినప్పుడు, అసహనము రేకెత్తినప్పుడు మనిషికి నిగ్రహం అవసరం. ఈ దుర్గుణాలను పోగొట్టుకొనడానికి నేను ప్రయత్నిస్తూ వచ్చాను. ఇందుకు సాధన ముఖ్యం. సాధనకు అందనిది ఏదీ వుండదు. ఇటువంటి వాటిని సాధన మీద పోగొట్టుకొన్నాను. కరుణ భావమును పెంపొందించు కుంటూ వచ్చాను. అన్నిటికంటె జాలి గొప్పది. మానవులను, ప్రాణులను ప్రేమించాలి. ప్రపంచాన్ని, ప్రకృతిని కరుణా దృష్టితో వీక్షించాలి. ఇది సాహితీ పరునకు అతి ప్రధానం; ఉత్తమ భావుకత్వానికి పరిపోషకం".

## గొప్ప తాత్త్వికుడు

సహజంగానె అప్పారావుగారు ప్రసన్న వదనులు. ఆయన యెల్ల వేళలా నవ్వు ముఖంతో హాస చంద్రికలను, హాస్య చమత్కృతులను వెద జల్లు తుండేవారు. కవిత, హాస్య చతురత, సంభాషణా కమనీయత, నిరుప మానమైన బుద్ధికుశలత అప్పారావుగారికి చిన్నప్పటి నుండీ ఉన్న గుణాలు. "స్వభావంలో నాటకీయ లక్షణం లోపించి నందువల్ల మనిషికి త్వరగా కోపం వస్తూ ఉంటుంది. కోపాన్ని తాత్త్విక దృష్టితో అణచుకోవచ్చు. కోపం వచ్చినప్పుడు రెచ్చి పోకూడదు. కొంచెం తమాయించుకోవలెను. అది ఎందుకు పుట్టిందో దాని పుట్టుకను తాత్త్విక దృష్టితో పరిశీలించాలి. ఈపరిశీలన దానిని జయించడానికి తోడ్పడుతుంది. క్రోధాన్ని జయించ గలిగినప్పుడు, జీవితంలో

అనేక ఒడుదొడుకులు తటస్థించినా వాటిని దాటి మనిషి అచంచల మేరువువలె నిలబడ గలుగుతాడు.'' అప్పారావుగారి యిట్టి తాత్విక చింతనకు ఆయన కేవలం పుస్తకాల్లో లెక్కలేనంతగా చదివిందే కారణమూ, మూలమూ కాదు. ఆయన తన చుట్టూ ఉన్న మనుష్యులను, సమాజాన్ని చందస్సును విడదీసినట్టు విడదీసి పరిశీలనలు జరిపాడు. అందువల్ల కలిగిన లోకానుభవమే అప్పారావుగారు గొప్ప తాత్వికులు కావడానికి కారణం. తాము వేదాంత వేత్తలకే వేదాంతాన్ని బోధించగలమని అప్పారావుగారు అనేవారట.

## అత్యున్నత శిఖరాలు

ఈ తొమ్మిది సంవత్సరాల్లో అప్పారావుగారు చేసిన అమోఘమైన కృషి కొద్ది సంవత్సరాల తరువాత ఆయన సాహిత్య లోకంలో అత్యున్నత శిఖరాలను అందుకోవడానికి రాకెట్‌వలె పనిచేసింది. అయితే యీ కృషి వల్లనే అప్పారావుగారి కున్న కాస్తపాటి కండ బలం హరించి పోయింది. రోజూ కళాశాలకు వెళ్ళి ఉపన్యాసా లిచ్చే సత్తువ లేకుండా పోయింది.

## మెత్తని మనసు

1895 మార్చి నెలలో 27వ తేదీన అప్పారావుగారు తమ డైరీలో యీ విధంగా వ్రాసుకున్నారు—"ఇవాళెందుకో మనసు బాగుండలేదు. విచారం ముంచు కొస్తున్నది. మనసు పరిపరి విధాలా పోతున్నది. మా మామగారి కుటుంబం! ఎంతమంది పోయారు! వాళ్ళందరూ తలపుకు వస్తున్నారేమో మరి! అందులోను చిన్నపిల్లడు చిట్టిబాబు! పాపం! ఇవాళ తెలుగు సంవత్సరాది. లోకంలో పరిపూర్ణానందం వెల్లివిరియుగాక!" అప్పారావుగారిది చాల మెత్తని హృదయం. నిండుమనస్సు నవ్యనవనీత సమానం. సాహిత్య చర్చలు జరిగినప్పుడు మాత్రమే ఆయన పలుకు ముక్కలు ముక్కలు చేసే శస్త్రంతో సమానం. అప్పారావుగారి చిన్నప్పుడు జరిగిన ఒక సంఘటనను ఆయన ప్రియమిత్రుడు గిడుగు రామమూర్తిగారు వివరిం

చారు—"మా నాన్నగారు పోయేసరికి నాకు పధ్నాలుగేళ్ళు మాత్రమే. దుఃఖం పట్టలేక పోయాను. అవును, నాకింకా జ్ఞాపకం ఉంది. దుఃఖిస్తున్న నన్ను చూసి దుఃఖం పట్టలేక అప్పారావు భోరున దుఃఖించ సాగాడు. అదే నన్ను ఉపశమింప జేసింది."

## శాసన పరిశోధకుడు

1895 మార్చి 31 వ తేదీన మద్రాసులో ప్రఖ్యాత సర్జన్ బ్రౌనింగ్ అప్పారావుగారిని పరీక్షించి, "మీ అవయవాలకు వచ్చిన ప్రమాదం ఏమీ లేదు. అవి బాగానె ఉన్నాయి. కాని మీ నరాలు మాత్రం ఎక్కడికక్కడ విడిపోయినట్టు ధ్వంసమయినవి. మీరు కాలేజీ నుంచి విరమించాలని నా అభిప్రాయం. ఎంతమాత్రం మీరిక కాలేజీలో పనిచేయగూడదని, వెంటనే విరమించాలని నా సలహా. శరీరానికి యెండ తగలడం మంచిది కాదు. ఎండ పొడ మీ శరీరానికి పడదు; రొజ్జగాలి తగలనీయవద్దు ... మీ మూత్రంలో జబ్బు ఉన్నదో లేదో భోగట్టా మీరు తెలుసుకున్నందువల్ల ప్రయోజనమేమీ లేదు. అది యేమిటో తెలుసుకుందామనే శారీరక శాస్త్ర ఆసక్తితో అడుగు తున్నారు తప్ప అది యెంత మాత్రమూ మీ ఔషధ సేవకు యెట్టి భంగమూ కలుగజేయదు—" అన్న అభిప్రాయాలను వెలిబుచ్చారు. ఇప్పటికి ఇంకా ముప్పది మూడు సంవత్సరాలయినా నిండలేదు అప్పారావుగారికి ; అప్పుడు ఆయన బరువు ఎనభైయెనిమిది పౌనులు మాత్రమే : నడుముకొలత 32 అంగుళాల కంటె తక్కువే. డాక్టర్ బ్రౌనింగ్ సలహాను పాటించి అప్పారావుగారు యెప్పుడూ ఎండపొడ తగలకుండా, రొజ్జగాలి సోకకుండా జాగ్రత్త పడేవారు. లోపల రెండుమూడు బట్టలను తొడుక్కొని, పైన కోటు తొడిగి శాలువ కప్పుకునేవారు. మేజోళ్లు, కాళ్లకు బూట్లు, శీతాకాలంలోను గొడుగు పట్టుకునేవారు. నీలగిరి కొండలమీద, అంత చల్లని ప్రదేశంలోని ఎండ వేడిమిని గూడ అప్పారావుగారు తట్టుకోలేక పోయేవారు. అంత సున్నితమైనది ఆయన ఆరోగ్యం. మిక్కిలి బలహీనమైన శరీరం అప్పారావుగారిది.

అందువల్ల అప్పారావుగారిని ఆనందగజపతివారు తమ సంస్థానంలో శాసన పరిశోధకునిగా నియమించారు. ఇది అప్పారావుగారికి విశ్రాంతి కలిగించి ఆరోగ్యం కాపాడడానికి చేసినపని. అప్పారావుగారు లెక్చరర్ పదవి నుండి విరమించి విజయనగర సంస్థాన శాసన పరిశోధకునిగా 1896 జూలై 5వ తేదీన ఉద్యోగం స్వీకరించారు.

## చరిత్రకారుడు

సంస్థాన శాసన పరిశోధకునిగా అప్పారావుగారు విజయనగరం ఆస్థానంలో ప్రవేశించడంతో ఆయన జీవితంలో మరొక అధ్యాయం ప్రారంభమయింది. శాసన పరిశోధన అప్పారావుగారికి అభిమాన పాత్రమైనది. తమ పరిశోధనలచే అప్పారావుగారు యెన్నో చారిత్రక రహస్యాలను వెతికి తీశారు. చరిత్రలో అప్పారావుగారి పరిజ్ఞానం, అధికారం సాటిలేనివి. ఒకసారి కెల్లెటు పండితుడు— "పోలికలూ, భేదాలూ నిరూపిస్తూ గ్రీకు, రోము రాజ్యాల చరిత్ర మీరెందుకు వ్రాయరు" అని అప్పారావుగారిని ప్రశ్నించారు. అందుకు అప్పారావుగారు, "అబ్బో అది నా శక్తికి మించిన పని" అని సందేహించగా కెల్లెటు తిరిగి "కాదు కాదు అది మీరే వ్రాయగలరు" అని గట్టిగా పట్టు బట్టారు.

## అనేకమైన ఆలోచనలు

"నిజమే, నాకు ఆలోచనలు లావు. మనసు ప్రశాంతంగా ఉండక అనేక విషయాల మీదికి దృష్టి పోతుంది. పురావస్తు తత్వ పరిశోధనలను కావించాలనే పిచ్చి ప్రబలిపోతున్నది. విజయనగరం రాజ కుటుంబీకుల చరిత్ర వ్రాయాలనే తలంపు ప్రత్యేకంగా నానాటికి హెచ్చుతున్నది. ఇందు నిమిత్తమే నేను బెంగుళూరు వెళ్ళాను. ఓరియంటల్ లైబ్రరీలో గంటల తరబడి కూర్చొని భోగట్టా సేకరించాను. సందేహాస్పదమైన ఆరోగ్యం కల వ్యక్తి సాధ్యమైనంత త్వరలో తాను చేయగల పనిని యేదో ఒకటి చేయడం

మంచిది. విజయనగర కుటుంబ పూర్వీకుల వంశ చరిత్రను గురించి కొన్ని కొత్త విషయాలను చెప్పగలిగితి నేని, అది నాకెంత సంతోషం!" విజయ నగర రాజుల వంశ చరిత్రకు, కళింగదేశ చరిత్రకు, ఆంధ్ర కవుల జీవిత చరిత్రకు అవసరమైన విషయ సేకరణను అప్పారావుగారు పూర్తిచేయ గలిగారు. ఇక మిగిలింది వారు దానికి ఒక రూపాన్ని యివ్వడమే. (అప్పా రావుగారి కార్య రంగమైన విజయనగరం విశాఖపట్నం జిల్లాలోని ఒక సంస్థానం. ఈ విజయనగరం కృష్ణదేవరాయల హంపీ విజయనగరం ఒకటి కావు).

## సంస్థాన రాజకీయాలు

సంస్థాన శాసన పరిశోధకులుగా గోదావరి, విశాఖ మండలాల్లో పర్యటించిన రోజులలో అప్పారావుగారు కన్నడ, బెంగాలి, పర్షియన్, లాటిన్ భాషలను నేర్చుకొన్నారు. కన్నడ వ్యాకరణాన్ని గురించి వ్యాసా లను గూడ వ్రాసినారు. తాము జరిపిన శాసన పరిశోధనలపై అప్పారావు గారు ప్రభుత్వానికి నోట్స్ గూడ సిద్ధపరచి యిచ్చారు. సంస్థానంలో ప్రవే శించిన తరువాత అప్పారావుగారు సంస్థాన రాజకీయాలకే యెక్కువ కాలాన్ని వినియోగించ వలసి వచ్చింది. ఇందూర్, జోద్‌పూర్ తదితర సంస్థానాల నుండి వచ్చే రాకుమారులను, అమాత్యులను అప్పారావుగారే ఆహ్వానించడం; అప్పారావుగారే వారితో మంతనాలు జరుపడం. విజయ నగరం సంస్థానానికి చెందిన పరిపాలనా విషయాలలోను అప్పారావుగారి సలహాలు, సహాయం అవసరమయ్యేవి. ఆనందగజపతి కాలంలోనె అప్పా రావుగారు దాదాపుగా సంస్థాన వ్యవహారాల్లో మునిగిపోయారు. ఇక ఆనంద గజపతి తరువాత సంగతి చెప్పనక్కర లేదు!

## కన్యాశుల్కం - కలవరం

"పుష్కలమైన, అనంతమైన సంఘటనలతో నిండి ఉన్న, ఎంతో గాంభీర్యమూ, వైవిధ్యమూ గల నేటి జీవితాన్ని వీక్షించక ప్రపంచ ప్రసిద్ధి

కెక్కిన ప్రాచీన కాల్పనిక కథల నుంచి రచయితలు ఇతివృత్తాలను ఎందుకు స్వీకరిస్తారో అర్థంగాక" అప్పారావుగారికి ఆశ్చర్యం వేసింది. ఈ కారణాల వల్ల, "నేను వాస్తవిక జీవితం నుంచి సమకాలిక ఇతివృత్తాన్ని స్వీకరించి దానిని వాడుక తెలుగు భాషలో నాటకంగా రూపొందించాను." ఈ నాటకం "కన్యాశుల్కం''. కన్యాశుల్కం 1892 ప్రాంతంలోనె రచింపబడింది. 1892 ఆగస్టులో కన్యాశుల్కం నాటకాన్ని ఆనందగజపతి వారి సమక్షంలో జగన్నాధ విలాసినీ నాటక సమాజం వారు అత్యంత మనోహరంగా ప్రదర్శించారు. కన్యాశుల్కాన్ని అప్పారావుగారు ఆనందగజపతి మహారాజుకు అంకితమిచ్చారు. కృతి సమర్పణోత్సవం సందర్భంలో మరొకసారి కన్యాశుల్కం ప్రదర్శించబడింది. అయితే కన్యాశుల్కం మొదటి కూర్పు అచ్చు కావడానికి అయిదు సంవత్సరాలు పట్టింది. 1897 జనవరి ఒకటవ తేదీన కన్యాశుల్కం మొదటి కూర్పు ముద్రణ అయి వెలుగు జూసింది. కన్యాశుల్కం తొలి కూర్పుకు గణనీయమైన విజయం లభించింది. పత్రికలు మనః పూర్వకంగా స్వీకరించినవి. తెలుగు సాహిత్య చరిత్రలో దీనినొక చరిత్రాత్మక సంఘటనగా పేర్కొని ప్రశంసించినవి. దీనిని ఆమోదించని వారు గూడ లేకపోలేదు. సంఘంలో, సాహిత్యంలో సంస్కరణ అంటె గిట్టనివారు కొంపలు మునిగినట్లు గోల చేయకపోలేదు. అయితేనేమి— "ఒక ప్రయోజనాన్ని కాంక్షించి, ఒక మార్గాన్ని నిర్దేశించడం కోసం నేను కన్యాశుల్కాన్ని వెలువరించాను. రచయితలు ముఖ్యంగా నాటక కర్తలు తప్పుదారులు పట్టి, పట్టాలు తప్పి సాహిత్యకృషి సల్పుతున్నారని నేను గమనించాను——" అన్నారు అప్పారావుగారు. "నే నాశించిన దానికంటె అధికంగా నా నాటకానికి విజయం సిద్ధించింది. అంతటితో నే ననుకున్న ప్రయోజనం నెరవేరింది—" అన్న సంతృప్తి గూడ అప్పారావుగారికి కలిగింది.

## ఉప్పెనవంటి ముప్పు

సృజనాత్మక రచనల సృష్టివైపు దృష్టి మళ్లిన తొలిరోజుల్లోనే అప్పారావుగారికి అనుకోకుండా ఉప్పెనవంటి ముప్పు వచ్చి పడింది.

అత్యంత ఆప్తుడైన ఆనందగజపతి 1897 వ సంవత్సరంలో మే నెల 23 వ తేదీన తెల్లవారు ఝాము మూడుగంటలకు పరమపదించారు. మహా రాజావారి మరణం అప్పారావుగారి హృదయాన్ని కలచి వేసింది. పట్టరాని దుఃఖంతో అప్పారావుగారు "ఇది నాకు చాల ప్రమాదకరమైన సంవత్స రంగా పరిణ మించింది. శ్రీ విజయనగరం మహారాజావారు, నేను దారా పుత్రులకన్నా, తల్లిదండ్రులకన్నా అధికంగా ప్రేమించిన వ్యక్తి పరమపదిం చారు . మా జీవితాలు ఆయన జీవితంతో పెనవేసుకు పోయినవి. లోకము నుంచి ఒక జ్యోతి వెడలిపోయింది—'' అని విలపించారు. ఆనందగజపతి వారి జ్ఞాపకాలు తలపున కొచ్చి నప్పుడల్లా అప్పారావుగారు బాధపడేవారు. పందొమ్మిదవ శతాబ్దం గడచిపోయి ఇరువదవ శతాబ్దం అడుగు పెట్టిననాడు అప్పారావుగారు యిలా అనుకొన్నారు— ''నూతన సంవత్సరం—1901. నూతన శతాబ్దం. పాపం ! ఈ శతాబ్దంలో జీవించే అదృష్టం మహారాజా వారికి లేకపోయింది !"

## మహామాత్యుల మరపించిన వాడు

ఆనందగజపతి మహారాజుకు సంతానంలేదు. అందువల్ల ఆయన వీలునామా ప్రకారం తల్లి అలకరాజేశ్వరి తమ అన్నకుమారుడు విజయ రామరాజును దత్త పుత్త్రునిగా చేసుకొన్నది. కొందరు రాజబంధువులు యీ దత్తత చెల్లనేరదని సంస్థానం మీద వారసత్వపు దావాను తెచ్చారు. ఇది సంస్థానపు పెద్ద దావాగా పేరుపొందింది. ఈ దావా 1897 నుండి 1912 వరకు పదిహేను సంవత్సరాలు నిర్విరామంగా కొనసాగింది. ఆనందగజపతి తరువాత విజయనగర సంస్థాన వ్యవహారాలను సర్దుబాటు చేయడంలో అప్పారావుగారికి ఊపిరి సలుపడానికి వీలుదొరికేది కాదు. ఆనందగజపతి జీవించి ఉన్నప్పుడు సైతం అప్పారావుగారు రోజుల తరబడి ఇంటికి వెళ్ళ కుండా కోటలోనే సంస్థాన వ్యవహారాల్లో తల మునక లయ్యేవారు. ఇక 1897 నుండి సంస్థాన వ్యవహారాల ఒత్తిడి మరింత యెక్కువయింది.

పదిహేను సంవత్సరాల కాలం దావాను నడుపడంలో అప్పారావు గారిదే ప్రధానమైన పాత్ర. ఇందుకొరకు ప్రత్యేకంగా అప్పారావుగారు న్యాయ శాస్త్రాన్ని అభ్యసించారు. భాష్యం అయ్యంగార్, అడ్వకేట్ జనరల్ శ్రీనివాస అయ్యంగార్ తదితర న్యాయశాస్త్ర కోవిదులకు అప్పారావుగారి సలహాలే శరణ్య మయ్యేవి. అందుచేతనే, అప్పారావుగారు చాణక్యుని, యుగంధరుని తలపుకు దెచ్చిన మహానీతిజ్ఞుడని శ్రీనివాస అయ్యంగార్, స్టూవర్ట్ ప్రశంసించారు. మదరాసు హైకోర్టు న్యాయమూర్తి బ్రాడీ తమ తీర్పులో "Apparao is the moving spirit in the suit" (అప్పారావు గారే ఈ దావాలో అత్యంత ప్రధానం అన్నభావం) అని పేర్కొన్నారు.

## మనవాడు

ఈ దావా ఉధృతంగా సాగుతున్న కాలంలోనే వ్యావహారిక భాషా వాదం మొదలయింది. వ్యావహారిక భాషావాదం అంటే మనం మన నిత్య జీవితంలో వాడుకొనే భాషనే మన సాహిత్యంలోను, మన రచనల్లోను, మన విద్యాలయాల్లోను ఉపయోగించాలని ప్రజల భాషకొరకు అప్పారావు గారు, గిడుగు రామమూర్తిగారు నడిపిన వాదం, ఉద్యమం అన్నమాట. తమ బాల్య మిత్రుడు గిడుగు రామమూర్తి గారితో కలిసి మరొక దావాను— వ్యావహారిక భాషావాదం – చేపట్టినారు. "గ్రామ్యభాష దిక్కుమాలిన స్త్రీ. ఆమెను పండితులు నిష్కారణంగా దూషించి అవమానించగా కనికరించి, ఫీజులేకుండా వకాల్తా పట్టితిని—'' అన్నారు అప్పారావుగారు. అప్పారావు గారికి 'లాయర్ని కావాలని కోరిక పుట్టింది': 'కోర్టుల్లో చాలా కేసులు నడి పించాను. కాని లాయర్ని మటుకు కాలేదు...."అన్నారు.

## పనులలో మునిగిన వాడు

సంస్థాన వ్యవహారాలు, వారసత్వపు దావా, వ్యావహారిక భాషావాదం అప్పారావుగారి మూలుగులను పీల్చివేసినవి. మొదలే ఆయన చాల

దుర్బలులు; ఎప్పుడూ అనారోగ్యం. అందుకు తోడు యీ వ్యవహారాలు ఆయనను యింకా బలహీన పరచినవి. అప్పారావుగారికి అరటికాయన్నా, పెరుగన్నా చాల యిష్టం. పకోడీలు తిని సోడా తాగడం కూడా ఆయనకు ప్రీతికరం. అయితే ఇవేవి ఆయన ఒంటికి పడేవికావు. వీటితో ఆయనకు అజీర్ణం కలిగి కడుపులో భగభగ మంటలు మండేవి. అనారోగ్యకారణాన ప్రతిసంవత్సరం అప్పారావుగారు చల్లని నీలగిరి కొండల ప్రదేశానికి వెళ్లే వారు. కాని అక్కడకి వెళ్ళినా అప్పారావుగారికి విశ్రాంతి దొరికేది కాదు. సంస్థాన వ్యవహారాలు, భాషా విషయక చర్చలు అక్కడికి ఆయనతోనే వెళ్ళేవి. వీటికి తోడు అప్పారావుగారికి విద్యా సంబంధమైన కార్యకలాపాలాయె. యూనివర్సిటీ పరీక్షాధికారిగా, పాఠ్యనిర్ణాయక సంఘం సభ్యులుగా, విశ్వవిద్యాలయం, విద్యాశాఖలకు సంబంధించిన ఇతర కమిటీలలో సభ్యుడుగా ఆయన చాల ప్రముఖమైన పాత్రను నిర్వహించారు. బహుముఖమైన కార్యక్రమాల వలన కలిగిన అనారోగ్యం అప్పారావుగారి సాహిత్య కృషికి అడ్డు తగిలింది.

## తీరిక—కోరిక

"నాకే ఆశలూ లేవు. నాకు విశ్రాంతి కావాలి. సాహిత్యకృషి కొనసాగించడమొక్కటే నా ఆశయం. అయితే సాహిత్య రచనను నేను సర్వస్వతంత్రుడుగా వుంటూ సాగించ వలెనని నా అభిమతం." అప్పారావుగారు యెప్పుడూ సర్వ స్వతంత్రులే. రాజాస్థానాలలో, దర్బారు రాజకీయాలలో తిరిగినా ఆయనకు 'చిత్తం బత్తెం, అనే అలవాటు లేదు. ఎంత హాస్య ప్రసన్నుడో అంత గంభీరుడూ, భయంకరుడూ అప్పారావుగారు, సాహిత్య కృషికి ఎంత విశ్రాంతి కావాలనుకున్నారో అంత విశ్రాంతి అప్పారావుగారికి దొరకలేదు—"నేనున్నగది కిటికీ తెరచి చూస్తే యెదురుగా బందరు కాలువ, కాలువ వెనుక వరుసలుగా, వరుసలుగా చెట్లూ కనుపిస్తవి. ఇటువంటి ఇల్లు ఒకటి కట్టుకొని అందులో కాపురం వుండాలని నా కోరిక.

ఏడాదికి కొన్ని నెలలైనా యిటువంటి ఇంటిలో విశ్రాంతి తీసుకోవాలని మనసు. తీరిక అనేది చిక్కి కాలం నా చెప్పుచేతల్లో ఉంటే యిటువంటి ఇంట్లో రిటైరు అవుతాను. రిటైరు కావడం! విశ్రాంతి! ఎంతవింతైన మాట! ఎన్నడూ విననిమాట! ఈ మాటకేమన్నా అర్థం ఉన్నదా! శరీర దారుఢ్యం పూర్తిగా సడలిన నావంటి వాడికి యిది యెంత వింతమాట! ఆరోగ్యం బాగున్నా లేకపోయినా బలవంతుడైనా, దుర్బలుడైనా మనిషి ఏవిధంగానూ రిటైరు అవుతాడు. అప్పుడు ప్రశాంతమైన ఒక ఇంట్లో గడిపే అవకాశమున్నది. కాని ఎప్పుడూ ఏదో ఆలోచిస్తూ, ఏదో వ్రాస్తూ వుండే నాకు విశ్రాంతి అనేది కల్ల. నా మెదడు ఎప్పుడూ పనిచేస్తూనే వుంటుంది, ఈ కృషి నుంచి నేను తప్పించుకుంటా ననేది పొసగనిమాట. డాక్టర్లు ఎన్ని సలహాలు ఇస్తేనేమి! వాటి దారి వాటిదీ; దీని దారి దీనిదీ; శ్రమ అధికమై, ఇక నేను ఏ పనీ చేయజాలని పరిస్థితే కలిగినప్పుడు నాకిక బ్రతుకు మీద ఆశేలేదు. పనిచేయలేక పోవడ మనేది ఒక విషమ పరిస్థితి." అప్పారావు గారు అనుకున్నంత పని జరిగింది. ఆయనకు విశ్రాంతి అనేది దొరుకలేదు. అయినా సాహిత్యకృషి ఆగలేదు. ఎక్కడ అయిదు నిముషాలు వీలు చిక్కితే అక్కడ చదివేవారు, వ్రాసేవారు. చుట్టూ కూర్చున్న వారితో ముఖ్యమైన వ్యవహారాలను ముచ్చటిస్తూనే ఆణిముత్యాలవంటి సాహిత్య ఖండికలను వ్రాసేవారు; విమర్శనా వ్యాసాలను రచించేవారు.

## తండ్రి—తమ్ముడు

అప్పారావు గారికి తల్లిదండ్రులమీద, తమ్మునిమీద అమితమైన ప్రేమ. తండ్రి వెంకటరామదాసుగారు తమతోనే కలసి ఉండాలని ఆనంద గజపతి కాలంలో ఆయనకు విజయనగరం ఖిల్లేదారు పదవి ఇప్పించారు. తమ్ముడు శ్యామలరావు గూడ అసాధారణ ప్రజ్ఞావంతుడు; అన్నగారికి తగిన తమ్ముడు. శ్యామలరావు గూడ చిన్నప్పటి నుండే ఆంగ్లంలో కవిత్వం వ్రాసేవాడు. ఆయనకు దేశాభిమానం ఎక్కువ; రాజకీయాలలో మక్కువ,

1889 లో బొంబాయిలో జరిగిన కాంగ్రెసుసమావేశాలకు వెళ్ళి ఉత్తేజితుడై కాంగ్రెసు స్థాపకులు హ్యూము, డబ్ల్యు. సి. బెనర్జి, నార్టన్ గారల మీద ఆంగ్ల గీతాలు వ్రాసి 'హిందూ' పత్రికలో ప్రకటించాడు శ్యామలరావు. శ్యామల రావుకు శంభుచంద్ర ముఖర్జీగారు 1889 అక్టోబరులో వ్రాసిన ఒక లేఖలో–"మీ వంటి శక్తివంతులైన విద్యార్థులు మా కలకత్తా విశ్వ విద్యాలయంలో ఉంటే బాగుండును. ఆంగ్లభాషపై మీకుగల అధికారానికి నేను ఆశ్చర్యపడ్డాను....చూడండి, ఆ ఇంకొక 'రావు' (అప్పారావుగారు) ఎంత పని చేశాడో మరి! మొదట నాలో అమిత ఆసక్తిని, గాఢమైన అనురాగాన్ని కలిగించి, ఉత్తరాలు వ్రాయడం మానివేసి, మధ్యలో నన్ను మరచి పోయాడు. కవిత్వం వ్రాస్తున్నాడు కదా!? అతని శక్తి అద్భుతం." శ్యామలరావు మదరాసులో న్యాయశాస్త్రం చదువుకుంటూ విద్యార్థిగా ఉన్నప్పుడే, పద్దెనిమిదవ యేట అకాల మరణం పాలయ్యాడు. తమ్ముని మరణం అప్పారావుగారిని కృంగదీసింది; మనోవ్యథను కలిగించి మానసిక శాంతి లేకుండా చేసింది. శ్యామలరావు మరణం తరువాత తండ్రి వెంకట రామదాసుగారికి ముసలి తనంలో, 1905 వ సంవత్సరాన, దుర్మరణం సంభవించింది. విజయనగరం నెల్లిమర్ల మధ్య ఉన్న ఊటగెడ్డ ఏరును దాటుతుండగా వరద ముంచుకు వచ్చి వెంకటరామదాసుగారు అసువులు కోల్పోయారు. అప్పారావు గారికి 1905 వ సంవత్సరం అంతులేని శోకాన్ని కల్గించింది.

## ఆయుధ ప్రయోగం

"స్నానం చేయడం, భోజనం చేయడం, కబుర్లాడుకోవడం, నిద్ర పోవడం, ఇంతేనా జీవితం? కాలం ఆ విధంగా గడుప గూడదు. ఎపుడో ఒకపుడు ప్రకృతి మానవునిపై తన ఆధిపత్యాన్ని చలాయిస్తుంది. అంత వరకూ రానీయక ఈలోపునే మనం ప్రకృతిపై ఆధిపత్యం వహించాలి. కన్నుమూసిన పిదప మనం చేయగలిగింది ఏముంది? కన్ను తెరచి ఉన్న

ప్పుడే మనం ఏమిచేసినాము. కనుక బ్రతికి ఉన్నన్నాళ్ళూ మనం సత్కర్మలు ఆచరించాలి.'' అంతరిక్షం లోనికి రాకెట్ల ప్రయోగాన్ని గురించి కనీసం ఊహించనైనా ఊహించని ఆ రోజుల్లో, ప్రకృతిపై ఆధిపత్యం వహించాలన్న ఉత్కృష్ట ఆశయంతో ప్రగతి శీలమైన శాస్త్రీయ, ఆధునిక దృక్పథానికి అప్పారావుగారు తెలుగు క్షేత్రంలో అంకురార్పణ చేశారు. సమాజంలో, సాహిత్యంలో కరడుగట్టి పోయిన ఛాందసత్వం మీదికి అప్పారావుగారు తమ ఆయుధాన్ని ప్రయోగించారు.

## శస్త్రచికిత్స—చేదుమాత్రలు

వాస్తవిక విషయాలను, యధార్థాలను కప్పిపుచ్చకుండా, రోగికి డాక్టరు శస్త్రచికిత్స చేసినట్లు సమాజంలో గల రుగ్మతలను కత్తితీసుకొని కోసి దేనికది విడదీసి, అన్ని భాగాలను పరీక్షించి చూచి అప్పారావుగారు చాటిన సత్యాలు కొందరికి చేదనిపించినవి—

ఈ సాంఘిక శాసనాలు, ధర్మాలు లోపభూయిష్టంగా ఉన్నప్పుడు వాటిని మనం బాహాటంగా ఎదుర్కొని సంస్కరించ వలసి ఉంటుంది. నువ్వొక న్యాయానికి, ధర్మానికి, సామాజిక నియమానికి లోబడి ఉండవలె నన్నప్పుడు, దానిని అనుసరిస్తున్న నీకూ ఒక హక్కు ఉంది. అది దోష భూయిష్టమైనదని నువ్వు విశ్వసిస్తున్నప్పుడు దానిని సంస్కరించే హక్కు, అధికారము నీకున్నవి.'' "మనం యేదైతే నిజమని నమ్ముతున్నామో దానిని ఆ పరమ సత్యాన్ని మనం నిర్మొహమాటంగా, చిత్త శుద్ధితో, నిష్కర్షగా పైకి చెప్పవలసిన సమయం ఆసన్న మయినది. మత విశ్వాసా లనేవి ఆచరణకు అసాధ్యమైనవి; నిరోధక మైనవి; గుదిబండల వంటివి. మానవుని ప్రేమించడ మన్నది అతి సాధారణమైన జీవితసూత్రం. ఇతరులను ప్రేమించడం వల్ల మానవునికి నిరవధికానందం సిద్ధిస్తుంది. మనం ఒకరికి యిచ్చే ప్రేమ మళ్ళీ మనకు ప్రేమను కొని తెస్తుంది. ఒకరి నొకరు

ప్రేమించు కోవడం ఎంత మహత్తర మైనదని! ఈ భూమి మీదికి స్వర్గం దిగివచ్చినంత! భూలోక స్వర్గమే!"

"అంధ విశ్వాసాలు ప్రమాదకరమైనవి. ఇవి వ్యక్తుల కార్యాలను, కార్యవిధానాలను తరచు నిర్దేశించు తుంటవి. ప్రశ్నించే స్వభావం లేనప్పుడు గుడ్డి నమ్మకాలు కలుగు తుంటవి. మనలను ఛాందసత్వం తనను ప్రశ్నించ నీయదు. సంశయాలతో ఉక్కిరి బిక్కిరి చేస్తుంది. అణకువతో పడి ఉండ మంటుంది. ఈ అణకువ పిరికితనానికి లక్షణం. కార్యకారణ సంబంధ జ్ఞానం శూన్యమైనప్పుడు ఏది జరిగినా అది కాకతాళీయం, వేళావిశేషం, విధి కృతం, యాదృచ్ఛికం అని వ్యక్తులు ఊహించి సంతృప్తి పడుతారు. ఆలోచనకు చోటివ్వరు."

"ఉన్న అసలు సంగతి యిది. సృష్ట్యాది వివిధ పరిణామాలను తెలి పేది మానవశాస్త్రం. మానవ పరిణామ శాస్త్రం అధ్యయనమూ, శాస్త్ర విమర్శక శక్తి ఎక్కువవుతున్న కొలదీ, ఈ జ్ఞానం ఒక పరమ సత్యాన్ని నొక్కి నొక్కి చెప్పుతున్నది. ఇప్పుడున్న సాంఘిక భావాలు పోయి వాటి స్థానే కొత్తవి రావలసిన అవసరానికి, అగత్యానికి మానవ పరిణామ వాదం దారి తీస్తున్నది. కంటి యెదుట స్పష్టంగా కనుపిస్తున్న వాస్తవ విషయాలకు భయపడి వాటిని మరుగుపుచ్చి తప్పించుక తిరగడం వలన ప్రయోజనం లేదు."

## దూరదృష్టి—మార్గదర్శి

అప్పారావుగారు తమ వ్రాతల్లో ప్రస్తావించని విషయం లేదు. వందల సంవత్సరాలు గడచినా ఆయన వివిధ విషయాల మీద సాకల్యంగా పరి శీలించి చేసిన విమర్శలు, వ్యాఖ్యానాలు పాతబడిపోవు. అవి సర్వ కాలీన మైనవి. అప్పారావుగారి దృష్టిలో పడని వస్తువులేదు. తమ సమకాలిక సమాజాన్ని పట్టి పీడిస్తున్న ప్రతి సమస్యమీద అప్పారావుగారు అమూల్య

మైన వ్యాఖ్యానాలను, విమర్శనలను పరిశీలనాత్మకంగా ప్రకటించారు. వాటిలో మనకు ఆశ్చర్యం గొలిపే దూరదృష్టి కనుపిస్తుంది. ఆయన మహాకవి గనుక, గొప్ప తాత్వికుడు గనుక, గొప్ప లోకజ్ఞుడు గనుక యీ దూరదృష్టి సాధ్యమయిందేమో. స్త్రీల దుర్భర పరిస్థితులను గురించి, వారికి సమాజం చేసిన అన్యాయాలను గురించి అప్పారావుగారు మాట్లాడినప్పుడు ఆయన విజృంభణము తట్టుకోవడం కష్టం. అన్యాయానికి గురి అయిన వారెవరైనా సరే ఆయన రక్షణ లభిస్తుంది. మానవత్వం ఆయనకు అతి ప్రధానం. ఆయన ఒక చోట అంటారు—"మగవాళ్ల అధికారం కింద, పెత్తనం కింద బానిసలుగా ఆడవాళ్లు ఏవిధంగా పడి ఉంటున్నారో, ఎంత క్రుగ్గి పోతున్నారో నేను ఊహించుకోగలను. నువ్వామాత్రం ఊహించలేవా? ఊహించి చూడు. నీ చుట్టూ కనుపిస్తున్న వైవాహిక జీవితాన్ని పరిశీలించు; అవగాహన చేసుకో....అందుకోలేని దుస్సాధ్యమైన సామాజిక నీతి సూత్రాలపై స్త్రీ, పురుష సంబంధాలు ప్రస్తుతం ఆధారపడి ఉన్నవని నాభావం."

"వివాహ సంస్థ పురోగతికి దోహదం చేసిందన్నమాట నిజమే. అయితే వివాహ బంధాన్ని తెంచుకోరాదనే నియమం చెప్ప నలవికాని కన్నీటి గాథలకు కారణం. ఈ సత్యాన్ని మన మెవరమూ విస్మరింపలేము—" అంటారు. మనం విడాకుల చట్టాన్ని రూపొందించు కొన్నది మొన్నమొన్ననే అనే విషయాన్ని మరచి పోగూడదు. అప్పారావుగారు అంతటితో ఊరుకోరు—''అన్ని జన్మల్లోకి నరజన్మ గొప్పది. స్త్రీ పురుషులిద్దరూ నరులే! ........ స్త్రీలు మేలుకోవాలి, ఎదురించాలి, తిరగబడాలి. మానవత్వం ఆమెలో అధికం. ఆడది అబలకాదు ........ మగవాడి కంటె ఆడది ఎందులో తక్కువ?" ఈ మాటలు యీ రోజే చాలమందికి రుచించవు. ఇక అప్పారావుగారు యీ మాటలు అన్ననాడు ఎందరు ఎంత మంది పడ్డారో! అప్పారావుగారి దూరదృష్టి గూడ అసాధారణ మైనది— ఆధునిక మహిళలు మానవ చరిత్రను తిరిగి రచిస్తారని అప్పారాయ మహాకవి దృఢంగా విశ్వసించాడు.

## ప్రజల ఉద్యమం

అప్పారావుగారు వెల్లడించిన యిట్టి భావాలు విద్యుత్ ఘాతాల వలె పనిచేసినవి. సంచలనం బయలుదేరింది. వ్యతిరేకత వీరావేశం దాల్చింది. కాని అప్పారావుగారు భయపడేవారు కాదు. భయం ఆయన తత్వంలోనే లేదు. ఆయన మరింత గట్టిగా ఉద్ఘాటించారు—"నా ఉద్యమం ప్రజలఉద్యమం. సంస్కృతీ పరుల భావ సంపద నాకు అండగా ఉన్నది. అసలు విషయాన్ని అర్థం చేసుకోజాలని ఎవరో కొందరువ్యక్తులు నాకు వ్యతిరేకంగా వ్యూహాలు పన్నితే పన్నుగాక ! నేనేమీ లక్ష్యపెట్టను."

సాంఘిక సంస్కరణోద్యమాన్ని పురోగమింప జేయడం, వాడుక భాష విశిష్టతను తెలియజెప్పడం తమ లక్ష్యాలు. ఈ లక్ష్య సిద్ధికి అప్పారావు గారు అడ్డులేని ఆయుధాలను ప్రయోగించారు ; రసాత్మకమైన కావ్యాలను విప్లవపూరితంగా రచించారు. ఆ కావ్యాలు ఒక కాలానికి ఒక సమాజానికి పరిమిత మయ్యేవికావు. సార్వజనీనత, సార్వకాలీనత వాటిప్రత్యేకత.

## సంఘసంస్కరణ-సాహిత్యసుమాలు

1897 లో ప్రచురించిన కన్యాశుల్కం నాటకాన్ని మార్పులు, చేర్పులతో కొత్తరూపం ఇచ్చి, నిండుగా తీర్చిదిద్ది 1909 వ సంవత్సరంలో అప్పారావుగారు మలికూర్పుగా వెలువరించారు. అప్పారావుగారి మాటల్లోనె— "మొదటి కన్యాశుల్కాన్ని పూర్తిగా మార్చి తిరిగి వ్రాతవ్రాశాను. ప్రస్తుత రూపంలో ఉన్న యీనాటకం యింపుమించు సరికొత్తది....బిడియమనేది అడ్డువస్తున్నమాట నిజమే అయినా కన్యాశుల్కం నాటకాన్ని గొప్ప రచనగా రూపొందించానని నేను అనుకుంటున్నాను. నాటకంచదివి నాకునేనే ముగ్ధుణ్ణ యాను. అదే దీనికున్న గీటురాయి. మొదటి కూర్పుకంటె రెండవ కూర్పు నా మనోభావాలను, ఆలోచనలను సమగ్రంగా వ్యక్తం చేస్తున్నది." ఎంతటి ఆత్మవిశ్వాసం ! రెండవకూర్పు పీఠికను అప్పారావుగారు నీలగిరిలోని

ఎక్కుహిల్‌హౌస్‌లో కూర్చుండి 1909 మేనెల మొదటిదినంనాడు వ్రాసు కొన్నారు. ఈ పీఠిక ఒక మణిపూసవంటి సాహిత్య ఖండిక. ఆలోచనాపరుల మస్తిష్కాలలో అగ్గిరవ్వలను రేపి ఆసక్తిని రేకెత్తించ గలిగినట్టిది; దాని కదే సాటి. మరొకసంవత్సరం తరువాత అప్పారావుగారు కొత్తపాతల మేలు కలయిక క్రొమ్మెరుంగులు జిమ్మగా తేటైన తెలుగు మాటలను కూర్చుకొని 'ముత్యాలసరాలు' అన్నపేరుతో నిజంగానె ముత్యాలవంటి గేయాలను రచించారు. అదే సంవత్సరం, అప్పారావుగారి మాటల్లో చెప్పాలంటే, భూమికి దూర బంధువు అయిన తోకచుక్క దారిబోవుచు చూడవచ్చెను. బరంపురం పట్టణంలో అదేసంవత్సరం పదిరోజులుండి అప్పారావుగారు నానావర్ణ సహపంక్తి భోజనంలో (అన్నికులాలవారు కలిసి అన్నంతినడం) పాల్గొన్నారు. ఆరోజుల్లో అది మహాపరాధం; అటువంటి అపరాధం చేసిన వారిని వెలివేసేవారు. అది 1910 వ సంవత్సరం. అప్పారావుగారి జీవితంలో అప్పటికి నలభై ఎనిమిది వసంతాలు గడచిపోయినవి; అన్ని వసంతాలవలనె గడువలేదు; అదివేరేమాట. ఇక వచ్చేరెండుమూడు సంవత్సరాల్లో వరుసగా అప్పారావుగారి లేఖిని నుండి సాహిత్య సుమాలు వికసించినవి; కొండు భట్టీయం, బిల్హణీయం, సుభద్ర, కన్యక, దించులంగరు, నీలగిరి పాటలు మొదలయినవి.

## జాతీయ సమైక్యత

1912 లో, వారసత్వపు దావా అప్పారావుగారి లౌక్యంతో, వ్యవహార దక్షతతో పరిష్కారం అయింది. అప్పారావుగారికి కొంత వెసులుబాటు దొరికింది. ఆ సంవత్సరం వంగ - బెంగాలీ - భాషా కోవిదులతో, సాహిత్యవేత్తలతో అప్పారావుగారు జరిపిన ఉత్తర ప్రత్యుత్తరాలు, కలకత్తాలో ప్రముఖులతో వారు జరిపిన చర్చలు అత్యంత ప్రధానమైనవి. ఈ నాటికి మనం పట్టించుకోని కొన్ని అనివార్యమైన భాషాసమస్యలను అప్పారావుగారు ఆనాడు వంగభాషా పండితులతో కలిసి పరిశీలించారు. అప్పారావు

గారి ముందుచూపు యిందులో స్పష్టంగా కన్పిస్తున్నది. వంగీయసాహిత్య పరిషత్తు అధ్యక్షుడు శారదా చరణమిత్ర 1912 ఏప్రిల్ 15 నాడు ఒక లేఖలో—"మీరు వ్రాసిన ఉత్తరం, పంపిన తెలుగు గేయం అందినవి. దేవనాగర లిపిలో అచ్చయిన ఆగేయాన్ని నేను చదువగలిగినాను. మీ గ్రంథాన్ని ఒక నిధివలె దాచి ఉంచాను. దేవనాగర ద్వితీయ సంచికలో అది అచ్చుపడేటట్లు చూడగలను. భారతదేశ సమైక్యతకు మనం ఒక సామాన్య లిపిని, సాహిత్యభాషను పెంపొందించుకోవలసి ఉంటుంది. సరే, మీరు కోరినట్లు, ఎవరినో ఒకరిని ప్రోత్సహించి ఆధునిక వంగ సాహిత్య భాషను గురించి విపులంగా ఒక వ్యాసం వ్రాయించగలను—" అని తెలిపినారు. అప్పారావుగారు ఆనాడే జాతీయ దృక్పథంతో, భారతదేశ సమైక్యత కొరకు భారతదేశపు భాషలమధ్య ఉండదగు సమన్వయాన్ని గూర్చి, భారతీయ భాషలన్నింటికి కలిపి ఏక లిపిని రూపొందించవలసిన అవసరాన్ని గురించి ఆలోచించారు! అంతేకాదు; తెలుగులో శాస్త్రీయ, సాంకేతిక పారిభాషిక పదాలను సమకూర్చడానికి గూడ అప్పారావుగారు యోచన చేశారు. ఈ విషయంలో యితరభారతీయ భాషలవారి, ప్రత్యేకించి వంగ భాషవారి అనుభవాలను తెలుసుకొనడానికి అప్పారావుగారు ప్రయత్నించారు.

## రవీంద్రుడు - గురజాడ

అదే సంవత్సరం కలకత్తాలో వంగీయ సాహిత్య పరిషత్తు మహాకవి గురజాడ అప్పారావుగారి గౌరవార్థం తేనీటి విందుచేసి సభ జరిపింది. ఇది 1912 జనవరి నెలలో జరిగిన సంగతి. 1912 డిసెంబరు నెలలో అప్పారావుగారు కలకత్తా నగరంలో రవీంద్ర కవీంద్రుని కలుసుకొని వివిధ సాహిత్య విషయాలను ముచ్చటించారు; 1912 మే నెలలో మద్రాసులో జరిగిన ఆంధ్ర సాహిత్య పరిషత్తు సమావేశంలో పాల్గొని తమ ప్రసంగంలో వ్యావహారిక భాషా ప్రయోజనాన్ని అతి సమర్థవంతంగా విశదీకరించారు. 1913, 1914 సంవత్సరాలలో వ్యావహారిక భాషావాదం మరొకసారి

ఉవ్వెత్తున లేచింది. విశ్వవిద్యాలయం యీ వాదానికి రంగంగా మారింది. అప్పారావుగారి ఆరోగ్యం పూర్తిగా క్షీణించ సాగింది. అనారోగ్యంతోనె అప్పారావుగారు వ్యావహారిక భాషా వాదంలో-ఆసమరంలో-పాల్గొన్నారు. పాండిత్యానికి, సాహిత్య కృషికి, విద్యావేత్తగా ఆయన చేసిన సేవకు సముచిత సన్మానంగా ప్రభుత్వం అప్పారావుగారిని మదరాసు విశ్వవిద్యాలయపు సెనెట్‌లో శాశ్వత సభ్యునిగా-ఫెలో-నియమించింది. ఇది 1913లో జరిగిన సంఘటన. 1914 వ సంవత్సరం ఏప్రిల్ మాసంలో మరొక చరిత్రాత్మక సంఘటన జరిగింది. భాషాశాస్త్రంలో, సాహిత్యంలో అప్పారావుగారికి ఉన్న అద్వితీయమైన పాండితీ ప్రతిభ వెలుగులోనికి రావడానికి యీ సంఘటన సంభవించింది. మదరాసు విశ్వవిద్యాలయం ఏర్పరచిన 'తెలుగు కాంపొజిషన్ సబ్ కమిటీ' తీర్మానించిన విషయాలకు అప్పారావుగారు భిన్నాభిప్రాయాలను ప్రకటించారు. ఈ భిన్నాభిప్రాయాలను అప్పారావుగారు "The minute of dissent to the report of Telugu composition sub-committee" అన్న పేరుతో ప్రచురించారు. ఈ భిన్నాభిప్రాయాల గ్రంథం బహుళ ప్రశంసలను అందుకొన్నది. ఇదొక ఉద్గ్రంథం. అప్పారావుగారు అనేక సంవత్సరాలు అలసట లేకుండా జరిపిన సాహిత్య పరిశోధనలకు, ప్రయోగాలకు ఫలితం యీ గ్రంథం; వ్యాహారిక భాషా వాదాన్ని సమర్థించే తిరుగు లేని తీర్పు ఇది. ఈ గ్రంథం యెంత అమూల్యమైనదో యేట్స్ పండితుని మాటల్లో వివరించ బడింది- "మీరు పంపిన అత్యంత అమూల్యమైన మీ పరిశీలన గ్రంథం అందింది. అనేక అభివందనాలు. భాషా శాస్త్రం దృష్ట్యా అది తిరుగులేనట్టిది. మీరు మీపరిశీలనలో పూర్వపక్షానికి తావివ్వని సిద్ధాంతాలను ప్రతిపాదించారు........పాండిత్యానికి తార్కాణమైన అటువంటి ఉత్తమోత్తమ గ్రంధాన్ని రచించేటప్పుడు మీరు ఎంత శ్రమపడ్డారో నేను ఊహించుకో గలను. మీరు రచించిన ఈ పుస్తకాన్ని ఆయనకు (కెయిరోలోని ఒక పండితుడు) పంపాలని నా కోరిక........ ఎదురు వాదించవీలులేని తమ పరిశోధన గ్రంథంలోని ప్రతి అక్షరం నిజ

మని రుజువు చేయడానికి గిడుగు రామమూర్తి ప్రాచీన గ్రంథాలనుంచి ఎన్నో ఉదాహరణలను సేకరించారు........మీరూ ఆయన కావిస్తున్న అమోఘ మైన యీ కృషిని యీ నాడు కాకుంటే రేపయినా అందరూ హర్షించి, శిరోధార్యమని ఆమోదించక తప్పదు....నిరంతరం శ్రమపడడం వల్ల మీ ఆరోగ్యం క్షీణించింది. మీ కృషి అనన్య సామాన్య మైనది.''

## ప్రజల భాష ప్రాముఖ్యం

అప్పారావుగారిపై ఎన్ని ఒత్తిడులు వచ్చినా తమ ప్రజా ఉద్యమాన్ని మాత్రం వదలిపెట్టలేదు. కళింగ దేశ చరిత్రను వాడుక భాషలో వ్రాస్తే విజ్ఞాన చంద్రికా గ్రంథమండలి వారు అచ్చువేయమన్నారు. అయినా, ఎవరినో సంతోష పెట్టడానికి తమ ఆశయాన్ని, ఆదర్శాన్ని వదులుకో బోమని అప్పారావుగారు ఉద్ఘాటించారు. ''... .... వివిధ భావాల వ్యక్తీ కరణకు కావలసినంత మేర ఉన్న భాష ప్రజల వాడుక భాష. దీని సౌకుమా ర్యానికి, లాలిత్యానికి విదేశీయులు సైతం ముగ్ధులయినారు. తెలుగు భాషలో మధురమైన వచనం వాడుక భాషలో ఉన్నది ...నాకు మాత్రం నా మాతృ భాష వాడుక భాష; అదే జీవద్భాష ...ఈ జీవద్భాషలో మన సుఖాల్ని, దుఃఖాల్ని వెల్లడించుకోవడానికి మనం ఎవరమూ సిగ్గుపడడం లేదు గాని దీన్ని వ్రాయడానికి మాత్రం మనలో కొంత మంది బిడియ పడుతున్నారు. వ్యావహారిక భాషలో ఉన్న సాహిత్యం రైతును మేల్కొల్పుతుంది....దాని శక్తి అపారం, అవకాశాలు అనంతం. ఇంతకీ నూతన కావ్యభాషను రూపొందించేవి వాదప్రతివాదాలు కావని నాకు తెలుసు. నూతన కావ్య భాషను ఒక మహారచయిత వ్రాయాలి; తయారు చేయాలి; అందుకు మనం అతనికి అనుకూల పరిస్థితుల్ని, వాతావరణాన్ని కలిగిద్దాం''.

## మహారచయిత

వాద ప్రతి వాదాలను ఒకవైపున కొనసాగిస్తూనే మరొక వైపున అప్పారావు గారే తాము నిర్దేశించిన మహత్తర కార్యాన్ని పూర్తి చేశారు.

అనుకూల పరిస్థితులు, అనుకూల మైన వాతావరణం లేకపోయినా అప్పారావు గారు నూతనమైన కావ్యభాషను సృష్టించారు. ఆ గౌరవాన్ని పొందిన మహా రచయిత ఆయనే. నాటకం, కవిత, కథ, వ్యాసం, విమర్శ మొదలయిన అన్ని సాహిత్య ప్రక్రియల్లోను నూతనమైన, సజీవమైన, శక్తివంతమైన కావ్యభాషను అప్పారావుగారే ప్రవేశపెట్టినారు. కొండంత ఆశతో అప్పారావుగారే వాడుక భాషలో ప్రప్రథమంగా జీవితంవంటి నాటకాన్ని రస వంతంగా విరచించారు.

## బహుముఖ కార్యక్రమం

సృజనాత్మక రచనల సృష్టి ఒకవంక. మరొకవంక పత్రికలలో విమర్శలు ; సభలు, సమావేశాలలో ప్రసంగాలు ; విశ్వవిద్యాలయ కమిటీలలో చర్చలు, మిత్రులకు లేఖలు. ఇవి అప్పారావుగారు వాడుక భాష ఉద్యమ పురోగమానానికి అవలంబించిన పద్ధతులు. అప్పారావుగారి విమర్శలు, వాదనలు సహేతుకమైనవి, విషయ సంపన్నమైనవి ; శాస్త్రీయమైనవి. ప్రతిభావంతుడైన లాయర్ వాదనల వంటివి ఆయన వాదనలు. అప్పారావు గారే ఒక లేఖలో యీ విధంగా వ్రాశారు— "వివాదాలలో నేను అవలంబించే పద్ధతివేరు. ప్రతిపక్షీయులను తమకు తోచిన రీతిని వ్రాసుకు పోనిస్తే పోగా పోగా వాళ్లే దారి తప్పుతారు. ఒక్కొక్క విమర్శకునికి వరుసవరుసగా నేను సమాధానాలిస్తున్నాను. బహువింతలు గొలిపే విషయాలను ప్రస్తావిస్తూ విమర్శకులందరినీ ఎదుర్కొంటున్నాను. మదరాసులోఉన్న గ్రాంథిక భాషా వాద కూటమి నాయకులు నన్నుచూడడానికి వచ్చారు. నాతో కత్తులు దూయ డానికి ఎవరూ తొందర పడడంలేదు, సంశయిస్తున్నారు."

## కాలంకంటె ముందు

అప్పారావుగారు అప్పుడప్పుడు లండన్, పారిస్ నగరాల్లోని తమ మిత్రులతో ఉత్తర ప్రత్యుత్తరాలు జరిపి సాహిత్య సమాలోచనలు చేసేవారు.

మనదేశంలో లభ్యంగాని గ్రంథాలను, భాషావిషయక, సాహిత్య సంబంధ సమాచారాన్ని లండన్, పారిస్ నగరాల్లోని గ్రంథాలయాలనుండి, పుస్తక సంస్థలనుండి తెప్పించుకొనే వారు. ప్రథమ ప్రపంచ సంగ్రామంలో ప్రత్యక్షంగా కలిగిన అనుభవాలను కొన్నింటిని అప్పారావుగారికి ఆయన మిత్రుడొకతను లండన్ నుండి జాబులో వివరించినాడు.

1914 వ సంవత్సరం జనవరి ఒకటవ తేదీన తమ డైరీలో అప్పారావుగారు ప్రముఖ ఇంగ్లీషు సాహిత్య వేత్తలు జార్జి బెర్నార్డ్‌షా, ఏట్స్, రుడ్‌యార్డ్ కిప్లింగ్, జి. కె. ఛస్టర్‌టన్‌ల చిరునామాలను వ్రాసుకొన్నారు. వీరితో అప్పారావుగారు బహుశ ఉత్తర ప్రత్యుత్తరాలను జరిపే ఉంటారు. ఎంతటి విలువైన విషయాలను తమలేఖల్లో ఉల్లేఖించారో మనకు తెలియదు! అప్పారావుగారు చిత్రించిన రెండు పాత్రలు మాట్లాడుకునే మాటలు వింటే అవి ఆయన విషయంలోనె అక్షరాలా సత్యమనే భావన కలుగుతుంది: "సరిసరి; మీకింకా తెలియదన్నమాట; కవిగారి స్వప్నలోకం, ఊహా ప్రపంచం! అక్కడ బీదాబిక్కి ఉండరండోయ్!"— "ఊహా ప్రపంచమా! కాదు. మనం ఉంటున్న ఈ లోకంసంగతి మాట్లాడు తున్నాను. కవీ, తత్వవేత్తా తమకాలం కంటె ముందు ఉంటారు."

## చేయనిదేమిటి?

యాభై మూడేళ్లు నిండి, ఉన్న ఆ కొద్ది శరీరంగూడ ఉడిగి పోవడం మొదలయింది. నెలల తరబడి ప్రతిరోజు జ్వరం, కడుపులో నొప్పి, కడుపులో మంటలు. స్వతహాగా ఆయన మొదటినుండి చాల బలహీనులు, అర్భకులు. ఆయనశరీరంలోని ఎముకల్ని లెక్కించడానికి వీలయ్యేదట. అప్పారావుగారి ఒక మిత్రుడు "అప్పారావుకు ఒక తులం కండ ఉంటే యీ ప్రపంచాన్నే జయించుకు రాగలడ"ని అన్నాడట. ఇది నూటికినూరు పాళ్లు నిజం. ఆరోగ్యం అసలే సహకరించకుండా ఉన్నా ఆయన చేయకుండా

మానిన పని యేది?! గుఱ్ఱం సవారీ చేసేవారు, ఈతకొట్టేవారు, సైకిల్ తొక్కేవారు. టెన్నిస్, బిలియర్డ్స్, చదరంగం అప్పారావుగారికి అభిమాన పాత్రమైన ఆటలు. టెన్నిస్‌లో, బిలియర్డ్స్‌లో ఆయన ఛాంపియన్, చదరంగంలో చేయితిరిగిన మేటి. ఊరికే కౌశల్యంతో ఆడడమేకాకుండా ఆ ఆటల విధానాలను శాస్త్రీయంగా పరిశీలించేవారు; డయాగ్రమ్స్ వేసియే స్ట్రోకు—దెబ్బ—యేవిధంగా తగులుతుందో స్టడీ చేసేవారు. అంతేనా, సంగీతంలోను అప్పారావుగారు సిద్ధహస్తులు. కలాన్ని కదం తొక్కించి నట్టే కమానును నడిపించి మధురమైన సంగీతాన్ని వినిపించేవారు. హలాన్ని స్వయంగా నడుపకపోయినా వ్యవసాయంలోను అప్పారావుగారు ఆసక్తిని చూపేవారు; ఏ నారు యెప్పుడు యేపుగా పెరుగుతుందో, యే పంట యే భూమిలో చక్కగా యెదుగుతుందో సాకల్యంగా తెలుసుకొని వ్యవసాయం చేసేవారు. ఏ కొద్ది క్షణాలో తీరికగా ఇంట్లోఉంటే పూలుకోయడమో, విస్తళ్లు కుట్టడమో ఆయనకు సరదా; కాఫీ స్వయంగా కాచుకోవాలని ఉబలాటం; ఒకసారి కాఫీ చేయబోయి చేతులు కాల్చుకున్నారు!

## అనారోగ్యం

అంత అనారోగ్యంగా ఉన్నా ప్రాతః కాలంలోనే మేల్కొనడం మానలేదు; పూలతోటకు నడుచుకుంటూ వెళ్లడం ఆగలేదు. జ్వరంతోనె కోటకు వెళ్లి వ్యవహారాలను సర్దడం; నూరు డిగ్రీల జ్వరంలోను స్నానం చేయడం. ఇక సాహిత్య వ్యాసంగం—అది ఆయన ఊపిరి ఉన్నంతవరకు నిలిచేదికాదు; నిస్సత్తువలో పక్కమీద పండుకొని ఉండి, గిడుగు రామమూర్తి వంటి మిత్రులు వస్తే తెచ్చికోలు ఉత్సాహంతో ఎడతెగకుండా సాహిత్య చర్చలు జరిపేవారు. దానితో అలసట హెచ్చి, చెమటపట్టి ఆరోగ్యం మరింత దెబ్బతినేది. అందువలన డాక్టర్లు అప్పారావుగారి దగ్గరికి యెవరూ రాకుండా కట్టుబాటు చేశారు.

## నిమ్మళించలేదు

ఆరోగ్యం బాగుపడుతుందని 1915 ఏప్రిల్ నెలలో అప్పారావుగారు విశాఖపట్నంలో ఉన్నారు. విశాఖపట్నంలో వాతావరణం బాగుంటుందని, తగిన వైద్యసదుపాయం లభిస్తుందని అప్పారావుగారి ఆశ. మహారాణి లలితకుమారిదేవి (ఆనందగజపతి తరువాత విజయనగరం సంస్థానానికి వారసుడయిన రామరాజు సతీమణి) గారికి అప్పారావుగారు— ఆమె అంతరంగిక కార్యదర్శి— అంటే అంతులేని భక్తి గౌరవాలు. విశాఖపట్నం పెద్దాసుపత్రిలో జిల్లాసర్జనుగా పనిచేస్తున్న డాక్టర్ ఎల్లింగ్టన్‌కు ఆమె అప్పారావుగారి ఆరోగ్యాన్నిగురించి ఒక లేఖ వ్రాసింది; "వెంటనే అప్పారావుగారు ఉన్నచోటుకు వెళ్ళి కావలసిన ఔషధములు వాడుతూ కంటికిరెప్పవలె కాపాడుతారని నమ్ముతున్నాను" అని ఆమె ఆ లేఖలో వ్రాసింది. అప్పారావుగారు విశాఖపట్నంలో యెక్కువరోజులు ఉండలేదు. తిరిగి విజయనగరంలోనె మందులు తీసుకోసాగినారు. జబ్బుమాత్రం నిమ్మళించడం లేదు; ఇంకా ఎక్కువ అవుతున్నది. స్వయంగా మద్రాసుకు ప్రయాణంచేసే స్థితిలో లేరు. అందువల్ల తమ శరీర పరిస్థితిని తెలుపుతూ తగిన సలహాలు, సూచనల కొరకు అప్పారావుగారు మద్రాసులోని సర్జనుకు ఒక వివరమైన నివేదికను పంపించారు.

## మానసిక ఆందోళన

క్షణక్షణం క్షీణించి పోతున్న ఆరోగ్యం అప్పారావుగారికి మానసిక ఆందోళనను కలిగించింది. తిరిగితాము కోలుకుంటామన్న ఆశ అప్పారావుగారికి సన్నగిల్లింది. ఇక తాము యెక్కువరోజులు బ్రతికే అవకాశం లేదని అప్పారావుగారు అనుకొన్నారు. చేయాలనుకున్న పనులు పూర్తి కాలేదని, కలలు కలలుగానె ఉండిపోతున్నాయని, రాత్రింబగళ్లు రక్తాన్ని ఒడిపి జరిపిన సాహిత్యకృషి అసంపూర్ణంగా మిగిలిపోతున్నదని అప్పారావుగారి ఆవేదన;

హృదయాన్ని కెలికినట్టు బాధ. 1915 జూన్ నెల రెండవతేదీన ఫౌలర్ వ్రాసిన లేఖలో అప్పారావుగారి ఆవేదన, విచారం కన్నులకు కట్టుతున్నవి; అందులో— "ప్రియమైన అప్పారావుగారు. మీ ఉత్తరం చదువుతున్నప్పుడు నాకెంతో దుఃఖం వచ్చింది. మనం కొన్నింటిని అర్థం చేసుకోలేము. కష్టాలు మంచి వాళ్లకే వస్తాయి. వాళ్లనే అందరూ బాధపెడతారు.... ఇప్పుడు మీరు పడుతున్న ఆవేదన ఎందుకో నాకు తెలుసు. ఇన్నాళ్ళూ, ఇన్నేళ్ళూ నిరంతరం మీరు కావించిన కృషి తప్పక ఫలిస్తుంది. ఏ చరిత్ర కోసం మీరు మీ కాలాన్ని, శక్తిని ధారపోశారో ఆ చరిత్రను మీరే రచిస్తారు. తప్పదు. మీకు నిమ్మళిస్తుంది. నిమ్మళించిన తరువాత అది పూర్తి చేయవచ్చును. దిగులు పడవద్దు. మీకు ఒకరు ధైర్యము చెప్పనక్కరలేదు. మీ మనోధైర్యం చాల గొప్పది. మీరు ఆత్మజ్ఞాన సంపన్నులు. మానవుల కెరుకపడని అంతిమ యాత్ర స్థలానికి బయలుదేర వలసి వస్తుందని మీరు భీతిల్లరు. చిరునవ్వుతో మృత్యువును పలుకరించి, చిత్తస్థైర్యంతో పయనిస్తారు. మరణాన్ని ఆనందంతో ఆలింగనం చేసుకోగలిగిన ఆత్మపరిపక్వమును జీవితంలో సాధించడానికే మీరు జీవించారు. మీరు జీవన్ముక్తులు. ఇక్కడి నుంచి మీరువెళ్ళిపోతున్నందుకు మీకు దిగులులేదు. ఇక్కడ మీరు వదలిపెడుతున్న వాటి మీద మీ దిగులు. మీ కుమారునకు మీ కుటుంబానికి ఏలోటూలేదు ; ఇక మీ పెంపకపు కొడుకు ఆ చరిత్ర మీదనే కదా మీకున్న బెంగల్లాను! బెంగపడకండి.... మీ ఆశయాన్ని నేను నెరవేరుస్తాను. కాని మీమీద నాకింకా ఆశపోలేదు. చరిత్రను మీరేపూర్తి చేస్తారని నా ఆశ !" ఆశాకిరణం వలె జూలై నెలలో అప్పారావు గారికి కొంచెం స్వస్థత చేకూరింది. అందరు ఒక్కసారి 'హమ్మయ్య!' అనుకొని సంతోషంతో పొంగి పోయారు. జూలైలో ఫౌలర్ తిరిగి ఒక ఉత్తరం వ్రాస్తూ, "మీ ఒంట్లో నెమ్మదిగా ఉన్నందుకు ఆనందిస్తున్నాను. చిరకాలం నుంచి మిమ్మల్ని వేధిస్తున్నజబ్బు తిరుగు మొహం పట్టింది. చిట్టచివరికి మీరు జయించారు. మీరు తలపెట్టిన సాహిత్య కృషి ఫలిస్తుంది. మీరు అందుకోదలచిన ఆదర్శాలు మీరు

అందుకొంటారు. మీ కలలు నిజమౌతాయి. అవి నిజమయేవరకు మీరు జీవిస్తారు. చరిత్ర రచనను ప్రారంభిస్తున్నారా?...." అని ప్రశ్నించాడు. ఇక ఫరవాలేదనిపించింది. గండం గడచిపోయి నట్టనిపించింది. 1916 వ సంవత్సరానికి విశ్వవిద్యాలయ పరీక్షాధికారులుగా అప్పారావుగారు నియమితులైనట్టు తెలియవచ్చింది. అంతలోనె ముంచుకొచ్చింది అక్టోబరు; మళ్ళీ జబ్బు ప్రకోపించింది. అప్పుడేజబ్బు నయంకాదని అప్పారావుగారు ఫౌలర్‌కు వ్రాసినలేఖలో బాధపడ్డారు. కష్టాలన్నీ కట్టకట్టుకొని ఒకేసారి రావడం ఎంత విషాదకరం! అప్పుడే అన్నికష్టాలు! విజయనగరం వ్యవహారాలను నిరాఘాటంగా నడిపిన ఉద్దండునికి చివరి ఘడియల్లో చిక్కులూ, చికాకులు! రాగూడని నవంబర్ రానేవచ్చింది! నవంబరు నెలలో ఇరవై తొమ్మిది రోజులు మంచం మీదనుంచి లేవలేని స్థితిలోను లేఖలద్వారా మిత్రులతో సాహిత్య చర్చలు జరుగుచునే ఉన్నవి. నవంబర్ నాలుగున వ్రాసిన ఉత్తరంలో "అతిశీఘ్రంగా కోలుకొని మీరు ఆశిస్తున్నట్లు మీ ఆయుధాన్ని మీరు మళ్లీ చేతబుచ్చుకుంటారు" అని యేట్స్ గాఢంగా ఆశించారాయె! కాలానికి అంతతొందరగా కన్ను కుట్టుతుందని ఎవరు అను కొంటారు! నవంబరు నెలలో చివరిదినం— ముప్పదవరోజు. మేడమీదగదిలో, మంచం మీద మామూలుగా ధరించే దుస్తులన్నీ ధరించి అప్పారావుగారు పండుకొని ఉన్నారు. మంచం ప్రక్కన నిలబడిన కొడుకు, డాక్టరు, తల్లి, పిల్లలు, బంధువులు అందరి ముఖాలమీద దిగులు, ఆందోళన. అప్పారావుగారి ఆరోగ్యానికి అసలే సరిపడని రొజ్జగాలి లోనికి రొప్పుకొస్తున్నది; ఎండపొడ గది లోనికి మిడిసిపడు తున్నది. అప్పారావుగారు తమ దుస్తులన్నీ తీసివేయమని ఒక్క ఫ్లానల్ లాల్చీని మాత్రం ఉంచుకొన్నారు. కొడుకును దగ్గరగా పిలిచి "కొంచెం కొకోవైన్, దంపిన తాంబూలము తెచ్చిపెట్టు బాబూ!" అన్నారు. తాంబూలము చప్పరిస్తూ అప్పారావుగారు డాక్టరుగారి చేయిపట్టుకొని "వీటిని వేసుకో వచ్చునో వేసుకో గూడదో నేను బ్రతికుంటే ఆహార శాస్త్రం మీద ఒక గ్రంథం వ్రాస్తాను డాక్టరుగారూ!" అని చిరునవ్వు నవ్వారు. అప్పుడు

ఉదయం ఎనిమిది ఇరవై నిముషాలు. అది అప్పారావుగారి ఆఖరి దర హాసం— అవే అప్పారావుగారి చివరి మాటలు— ఆ మాటలు గ్రంథం వ్రాయడాన్ని గురించే! ఆ తుదిక్షణంలోను అప్పారావుగారి నిరాడంబరత్వంలో తొణికిసలాడే ఠీవి, గాంభీర్యం, హుందాతనం, హాస్యప్రసన్నత యెంత మాత్రమూ తగ్గలేదు. విశాలమైన నుదురు, తీర్చినట్టున్న ముక్కు, సొగసైన పెద్ద కళ్ళు ఆవదనంలో వెలుగుల్ని వెదజల్లుతున్నవి. మహాకవి, మహా పండితుడు, గొప్ప విద్యావేత్త, అత్యున్నత శిఖరం అధిరోహించిన నాటక రచయిత, సాటిలేని సాహిత్యవేత్త, తాత్వికుడు, మహామాత్యులను తలపింపజేసిన రాజనీతిజ్ఞుడు, బహుముఖ ప్రతిభావంతుడు, అత్యంత ఆధునికుడు అప్పారావుగారు ఆనాటి ఉదయం మరణించలేదు— ఆయన అమరుడు. ఆగిపోయింది అమూల్య మైన ఆయన లేఖిని మాత్రమే.

——::——

# సాహిత్య సమీక్ష

—x—

మహాకవి అప్పారావుగారి సాహిత్యం కలకాలం నిలిచి ఉంటుంది. అభ్యుదయాన్ని కోరేవారందరికి అప్పారావుగారి సాహిత్యం మార్గదర్శక మవుతుంది. ఆధునిక కాలాలు వచ్చిన కొద్దీ ఆయన సాహిత్యం అభివర్ణించ డానికి వీలుకాని గొప్పదనంతో విస్పారు తుంటుంది. సాహిత్యంలో, సమా జంలో సంస్కరణ కొరకు వొట్టిమాటలు చెప్పలేదు అప్పారావుగారు. సజీవ మైన వాడుకభాషా సాహిత్యం మాత్రమే అధునాతనమైన, శక్తివంతమైన ఆయుధంగా పనికిరాగలదని మొట్టమొదట గుర్తించినవారు అప్పారావుగారు.

## భారతీయం—నిరుపమానం

"నా ఆచరణ నా సిద్ధాంతాల కంటె ఎప్పుడూ ఓ అడుగు ముందుకే-" అని అప్పారావుగారు అన్నమాటలు యధార్థమైనవి. ఇందుకు అప్పారావు గారి సాహిత్యమే చక్కని నిదర్శనం. ఒక సందర్భంలో తమ సాహిత్యాన్ని గురించి అప్పారావుగారు వ్రాసిన యీ మాటలు గమనించండి— 'తెలుగులో నవ్యరీతులకు, నూతన ప్రమాణాలకు ప్రయత్నించిన మొదటి కవిని నేనే. నా కావ్యకళ నవీనం ; కావ్య యితివృత్తాలు భారతీయం. కవితలో నేను ఉత్తమ ప్రయోజనాలను ఉపలక్షించాను ; జీవితాన్ని నూతన దృక్పథంతో దర్శించి కథా, కవితా రూపంలో దాని తత్వాన్ని అన్వయించడానికి ప్రయ త్నించాను. నాకు కళలపట్ల, జీవితంపట్ల కొన్ని ఆదర్శాలున్నవి. వాటిని సంస్కృతీ పరులు మాత్రం అర్థం చేసుకొని హర్షించగలరు. అనూచానంగా వస్తున్న ప్రాచీన సంప్రదాయాలకు భిన్నంగా ఎవరు ఏమి రచించినా అది ఒక ఘోరమైన అపరాధంగా భావించి వారిపై విరుచుకు పడుతున్నారు...." అప్పారావుగారు 1913లో పలికిన మరొక ముఖ్యమైన మాట— "సాహిత్య

రంగంలో యిప్పుడు నేను కావిస్తున్న కృషికి సమతుల్యమైన కృషి భారత దేశంలో మరెక్కడా కనుపించదు–" ఇది మన అదృష్టం.

## నాటకాలు

'నల' నాటకంతో అప్పారావుగారికి నాటకాలతో ప్రత్యక్ష సంబంధం ప్రారంభమైంది. చిన్నప్పుడు తమ స్నేహితుడు గిడుగు రామమూర్తి పంతులుగారితో కలిసి 'నల' నాటకంలో అప్పారావుగారు వేషం వేశారు. అప్పారావుగారి నాటకరచనకు వెనుక ఎంతో చరిత్ర ఉన్నది. భారతీయ సాహిత్యంలోని నాటకాలను, పాశ్చాత్య భాషలలోని నాటకాలను అప్పారావు గారు పరిశీలనాత్మకంగా పఠించారు. పాశ్చాత్యదేశాల నాటకరంగంలో వస్తున్న మార్పులను ఆయన అతిజాగ్రత్తగా అవలోకించారు. మనదేశంలో ఆనాడు పేరుపొందిన నాటకసమాజాలు ప్రదర్శించిన అనేక నాటకాలను అప్పారావుగారు సూక్ష్మాతి సూక్ష్మంగా, విమర్శనాత్మకంగా వీక్షించారు. ఇది సంవత్సరాల తరబడి సాగిన అధ్యయనం, పరిశీలన. అప్పారావుగారి డైరీలను పరికిస్తే ఉత్తమ నాటకరచనకు ఆయనను పురికొల్పిన పరిస్థితులు మనకు అవగతం కాగలవు. సంస్కృతంలోని నాటకాలను అప్పారావుగారు చదివిన పద్ధతిని గమనిస్తే మనకు ఆశ్చర్యం కలుగుతుంది. కథాశిల్పం, సన్నివేశకల్పన, పాత్రీకరణం, సంభాషణల ఔచిత్యం ఒకటేమిటి సూక్ష్మంగా ప్రతి అంశాన్ని పరిశీలించి అప్పారావుగారు తమ అభిప్రాయా లను వ్రాసేవారు. ఆనందగజపతి ఆస్థానంలోని జగన్నాథ విలాసినీ నాటక సమాజంతో అప్పారావుగారికి సన్నిహితమైన సంబధాలు ఉండేవి. ప్రత్యే కించి ఆ నాటక సమాజం దర్శకుడు, ప్రయోక్త గోమఠం శ్రీనివాసాచార్యులు అప్పారావుగారికి చాల దగ్గరివారు. ఇద్దరు కలిసి మదరాసు తదితర పట్టణా లలో నాటక ప్రదర్శనలకు వెళ్ళేవారు. చూసిన నాటకాల మీద వివరంగా వ్యాఖ్యలు; విమర్శలు వ్రాసేవారు. అప్పారావుగారు నాటక రచనలో కొత్త దారులు తొక్కడానికి యీ పరిశీలనలు, యీ అనుభవాలు యెంతో ఉపక

రించినవి. ఒక వైపున నాటక రంగపు అధోగతి, మరొకవైపున సంఘంలో జరుగుతున్న దురాచారాలు ; యింకొకవైపున సాహిత్యంలోని ఛాందసత్వం అప్పారావుగారిలో తీవ్రమైన సంచలనాన్ని కలిగించినవి. సమాజానికి సిగ్గు చేటుగా ఉన్న సాంఘిక దురాచారాలను బట్టబయలుచేసి ఉన్నతనైతిక భావాలను ప్రజలలో ఉద్దీపింప చేయడం కన్న మిన్న అయిన లక్ష్యమూ, ప్రయోజనమూ సాహిత్యానికి వేరొకటి లేదని అప్పారావుగారు నిశ్చయించుకొన్నారు. అయితే ఆనాడు ప్రజలలో పఠనాసక్తి తక్కువ ; చదువుకున్న వారిసంఖ్య చాలస్వల్పం. అందువల్ల దృశ్యకావ్యాన్ని— నాటకాన్ని— రచిస్తే బహుళ ప్రజానీకానికి తమ సందేశాన్ని అందించే అవకాశం కలుగుతుంది. అప్పటి వరకు నాటకాలలో వాడుక భాషకు ప్రవేశం లేదు. అందుచేత సంఘ సంస్కరణ ఉద్యమాన్ని పురోగమింపజేసి, వ్యావహారిక వచనం నాటక రచనకు పనికి రాదనే సామాన్య దురభిప్రాయానికి ఆధారంలేదని నిరూపించడానికి అప్పారావుగారు 'కన్యాశుల్కం' నాటకాన్ని రచించారు. ఈ రెండు లక్ష్యాలను 'కన్యాశుల్కం' నాటకం సాధించగలిగిందని చెప్పడానికి కాలమే సాక్ష్యం, ప్రమాణం. వాడుక భాషలో రచింపబడిన మొట్టమొదటి నాటకం కన్యాశుల్కం. కావ్యాలన్నింటిలోను నాటకం రమ్యమైనదని పెద్దలు చెప్పినమాట. మన నాటకాలన్నింటిలోను రమ్యమైనదీ, మనోహరమైనదీ 'కన్యాశుల్కం'. అప్పారావుగారి రచనాశిల్పం 'కన్యాశుల్కం' నాటకంలో కళాశిఖరాలను అధిగమించి పోయింది. ఇతివృత్త స్వీకరణలో నిర్వహణలో 'కన్యాశుల్కం' తెలుగు సాహిత్యంలో ఒక అపూర్వమైన అధునాతన ప్రయోగం. ప్రపంచంలోని అత్యుత్తమమైన కొద్ది నాటకాలలో 'కన్యాశుల్కం' ఒకటి. భారతీయ భాషలలో ఆధునిక కాలాన 'కన్యాశుల్కం' వంటి నాటకం వెలువడలేదని విజ్ఞుల భావం.

## కమనీయమైన కవిత

పట్టుమని పదిగీతాలైనాలేవు అప్పారావుగారివి. అయినా అప్పారావుగారు ప్రపంచకవి. అప్పారావుగారు మహాకవులలో మహాకవి. అప్పారావు

గారి ప్రతి ఒకగీతం ఒక కావ్యం. ఆయన తాను రచించిన ప్రతి ఒక కావ్యం లోను విశ్వశ్రేయస్సును, సర్వమానవ సమానతను, హృత్కమలమైన ప్రేమను ఉపలక్షించారు. అప్పారావుగారి కావ్యాలు బహుళార్థకమైనవి ; అవి ఒకేసారి సాంఘిక సంస్కరణను, వాడుకభాష సౌంష్టను, సర్వ మానవ సంక్షేమాన్ని, సౌభ్రాతృత్వాన్ని ఆవిష్కరింప చేస్తాయి. అప్పారావు గారు నిన్న మొన్నటి కావ్యలక్షణాలకు కట్టుబడలేదు. తమ అభ్యుదయ భావాలకు, ఆధునిక మనస్తత్వానికి అగుణమైన కావ్యలక్షణాలను అప్పారావు గారు స్వయంగా రూపొందించారు. "కవితాన్యాయం నిన్న మొన్నటివలె నేడు లేదు. మానవ జీవితాన్ని నేను చిత్రిస్తాను. చిత్రిస్తూ కళా నైపుణ్యంతో ఆదర్శపూరితం చేస్తానే అనుకో. కవితాకళకు నేను ఒదిగి ఉండవలసిన వాడినే అయినా మానవ సమాజం పట్ల నాకొక మహత్తరమైన బాధ్యత ఉంది" అంటారు అప్పారావుగారు. నేటి కవితాన్యాయానికి ఒదిగే ఒకకొత్త కావ్య భాషను, ఒక కొత్త ఛందస్సును అప్పారావుగారు సృష్టించారు. ఇంగ్లీషు, ఫ్రెంచి, బెంగాలీ, కన్నడ తదితర భాషల కవితావీధులలో, చందోరీతులలో స్వైర విహారం చేసినవాడు గనుక అప్పారావుగారికి కవితారీతులపై వినూతనమైన దృష్టి ప్రసరించింది. దీని ఫలితమే 'ముత్యాలసరాలు' పేరుతో అప్పారావుగారు వ్రాసినగేయాలు, అందులోని కావ్యభాష, అందులోని చందస్సు. జానపద గీతాల సరళి, సవ్వడి అప్పారావుగారి ముత్యాల సరాలకు మూలం. 'ముత్యాల సరాలు' అన్న పేరు పెట్టింది గూడ అప్పారావుగారే. ఒకజాతి పార్సీ గజల్ నడకను ముత్యాల సరాలలో తేవడానికి ప్రయత్నించా నని అప్పారావుగారు అన్నారు.

## నిప్పు రవ్వలు

ముత్యాల సరాల పుట్టుక చిత్రమైనది. వాల్మీకి మహాకవి కవితావిర్భా వానికి గురజాడ మహాకవి ముత్యాలసరాల అవతరణకు చాల దగ్గరి సామ్యం కన్పిస్తున్నది. ఇద్దరి కవితావేశానికి కారణం ఒక ఉత్కృష్ట ప్రయోజనం.

వాల్మీకి మహాకవి హృదయంలోని కారుణ్యం శోకంగా ఉబికి శ్లోకంగా మారింది. తమచుట్టూ మూఢ ఆచారాలతో, అనేక దుర్మతులతో నిండివున్న సమాజంలోని దురాగతాలు అప్పారావుగారి హృదయాన్ని దహించి వేసినవి; భుగభుగ మండిన యీ జ్వాలల్లో రగుల్కొన్న నిప్పురవ్వలే అప్పారావు గారి గీతాలు.

"గుత్తునా ముత్యాల సరములు
కూర్చుకొని తేటైన మాటల,
కొత్తపాతల మేలుకలయిక
క్రొమ్మెరుంగులు జిమ్మగా"

అని వాడుక భాషలోని తేటైన మాటలతో కొత్తపాతల మేలు కలయికగా అప్పారావుగారు ముత్యాలసరాలు గుచ్చితే వాటిని మెచ్చని వారు గూడ ఉన్నారు. అయితే మెచ్చకుంటే మించిపాయెను—

కొయ్య బొమ్మలె మెచ్చు కళ్ళకు
కోమలుల సౌరెక్కునా ?

అని అంటారు అప్పారావుగారు.

"ముత్యాల సరములు" అన్న పేరుతో ఉన్నది ముత్యాల సరాలలోని మొదటి గీతం— అప్పారావుగారు అప్పుడే పట్నంలో ఒక సంఘ సంస్కరణ కార్యక్రమంలో పాల్గొని ఇల్లుచేరు కొన్నారు. అప్పటికే ఆకాశంలో ధూమ కేతువు— తోకచుక్క కనుపించింది. ప్రేయసిని నిద్రలేపి—

కంటివే ? నేనంటి, 'మింటను
కామబాణం బమరియున్నది'
తెలిసి, దిగ్గనలేచి, ప్రేయసి
నన్నుగానక, మిన్ను గానక,
కురులు సరులును కుదురు జేయుచు
ఓరమోమిడ బల్కతిన్ . .

దూరబంధువు యితడు భూమికి,
దారిబోవుచు చూడవచ్చెను ...
తెగులు కిరవని కటల పన్నుచు
దిగులు జెందుటదేటి కార్యము ?
తలతునేనిది సంఘ సంస్కర
ణ ప్రయాణ పతాక గాన్—

పాపం ఆమెకు యిదంతా విపరీతంగా కనుపించింది. అప్పారావు గారు చెడిపోతున్నట్టే ఆమెకు అనిపించింది. భర్త సంఘసంస్కరణ కార్యకలాపాలను అపహాస్యం చేస్తూ కొందరు మాట్లాడుకున్న మాటలు ఆమెకు బాధను కల్గించినవి. అంతటితో అప్పారావుగారు ఊరుకొన్నా బాగుండను. లేదు యిలాగ అంటున్నారు—

చూడు మును మును మేటి వారల
మాటలనియెడి మంత్ర మహిమను
జాతి బంధము లన్న గొలుసులు
జారి, సంపదలుబ్బెడున్

యెల్లలోకము వొక్క యిల్లై
వర్ణభేదము లెల్ల కల్లై
వేల నెరుగని ప్రేమ బంధము
వేడుకలు కురియ

మతములన్నియు మాసి పోవును
జ్ఞానమొక్కటి నిలిచి వెలుగును
అంత స్వర్గ సుఖంబులన్నవి
యవని విలసిల్లున్—

ఇంతటి మహో ఉదాత్తమైన అంతర్జాతీయత, విశ్వమానవ కుటుంబ భావము, వర్ణభేదాలు లేని లౌకిక సమాజం అమాయకురాలు ఆమెకు యేమి అర్థమవుతాయి ?

కట్టుకున్నది యేమికానీ ;
పెట్టిపొయ్యగ పోతె, పోనీ;
కాంచిపెంచిన తల్లిదండ్రుల
నైన కనవలదో ?

కలసి మెసగిన యంత మాత్రనె
కలుగబోదీ యైక మత్యము ;
మాల మాదిగ కన్నె నెవతెనొ
మరులు కొన రాదో ?"

అంటూ ఆమె యిక మాటలవల్ల లాభంలేదను కొన్నది ; చివరి ఆయుధం ప్రయోగించింది—

అనుచు కోపము నాపజాలక
జీవితేశ్వరి సరుల నామై
చరచి చనె క్రొమ్మెరుగు చాడ్పున
మనసు వికలముగాన్—

ఎంత సహజంగా ఉన్నది యీ దృశ్యం ! రసాత్మకమైన వాస్తవిక జీవిత చిత్రణలో గురజాడ లేఖిని వేయిరేకులుగా వికసించుతుంది.

## మరొక ప్రపంచం

అప్పారావుగారి సంఘ సంస్కరణ ఆశయం, మానవత పతాక స్థాయి అందుకొన్న మరొక ఉజ్వలగీతం 'లవణ రాజు కల'. ఈ గీతాన్ని

చదువు తుంటే అప్పారావుగారు ఒకచోట ఉద్ఘోషించిన యీ మాటలు జ్ఞప్తికి రాక తప్పవు. "మాలవాణ్ణి చూడగానె అమాంతంగా కౌగలించుకోని వాడికి దేశమాత పేరు యెత్తే అర్హతలేదని నా గట్టి నమ్మకం." గాంధీ మహాత్ముడు కారణ జన్ముడుగా మహాపురుషుడుగా హరిజనోద్ధరణ ఉద్యమాన్ని ప్రారంభించకముందు అప్పారావుగారు యీ అభిప్రాయాలు వెలిబుచ్చారు. తమ యీ ఉన్నత ఆశయాన్ని ఉదాత్తమైన పద్ధతిలో అప్పారావుగారు 'లవణరాజు కల'లో చిత్రీకరించారు. విప్లవాత్మకమైన విషయాన్ని మనోహరమైన వర్ణనలతో కళాశోభితం చేసి అప్పారావుగారు అనిర్వచనీయమైన ఆనందం జాలువారే మరొక ప్రపంచాన్ని సృష్టించారు. ఆ ప్రపంచంలో మానవులకు మానవులకు మధ్య కృత్రిమమైన అడ్డుగోడలు లేవు; అందులో దురాచారాలు లేవు, దుష్టమైన శాసనాలు లేవు. అందులో అప్పారావుగారు అంటున్నారు—

మలినదేహుల మాలలనుచును
మలిన చిత్తుల కధిక కులముల
నెలవొసంగిన వర్ణ ధర్మమ
ధర్మ ధర్మంబే;

మంచి చెడ్డలు మనుజులందున
యెంచి చూడగ రెండె కులములు
మంచి యన్నది మాలయైతే
మాలనే అగుదున్!

'లవణరాజు కల'లో పవిత్రమైన భావాలను, ప్రణయ మాధుర్యాన్ని అప్పారావుగారు అతిరమణీయంగా చిత్రించారు. అప్పారావుగారి ఆలోచనలు కాలం కంటె ముందు పరుగెత్తుతాయని చెప్పడానికి యీ గీతం ఒక నిదర్శనం.

## దేశమును ప్రేమించుమన్నా!

చిన్నచిన్న మాటలలోనె తీయని తెలుగుదనం ఉట్టిపడే గీతం 'కన్యక' అప్పారావుగారి గీతాలన్నిటిలోను తలమానిక మైనది 'దేశభక్తి' గీతం.

అప్పారావు గారిని అమరులను చేయడానికి ఒక్క దేశభక్తి గీతం చాలు. ప్రపంచ మహాకవులలో ఒకరుగా అప్పారావుగారికి అంజలి ఘటించడానికి 'దేశభక్తి' గీతం ఒక్కటి చాలు. ఈ గీతంలో అప్పారావుగారు అవధులు లేని మానవతను మూర్తీభవింపజేసినారు. ఒక కాలానికిగాని, ఒక దేశానికి గాని యీ గీతం పరిమితం కాదు. ప్రపంచంలోని యే దేశంవారైనా, ప్రపంచ మానవులందరు పాడుకొనడానికి పనికివచ్చే జాతీయగీతం యీ గేయం. సర్వ కాలీనత, సర్వజనీనత యీ గీతంలోని ప్రత్యేకతలు. ఇక్బాల్ రచించిన 'సారే జహాఁసే అచ్ఛా హిందూస్తాఁ హమారా' గేయం వంటివి మన భారతీయులు మాత్రమే పాడుకొనడానికి పనికివచ్చే దేశభక్తి గీతాలు. కాని అప్పారావుగారు రచించిన 'దేశభక్తి' గీతం అటువంటిది కాదు. అది మనదేశపు యెల్లలను దాటి ప్రపంచంలోని యే దేశం ప్రజల కంఠాలలోనైనా నినదించే నిండుదనాన్ని కలిగి ఉంది. సర్వమానవులు ఆలాపించగలిగే ఉత్తమోత్తమ గీతాన్ని రచించిన మహాకవి మన తెలుగువాడు కావడం మన అదృష్టం. ఈ గీతంలోని ప్రతివాక్యం దేశాభిమానాన్ని మొలకెత్తించే సంగీతం. జీవిత గమనంలో అడుగడుగున యీ గీతంలోని యేదో ఒకవాక్యం మనలను ఉద్వేగపరచి, ఉత్సాహపరచి మునుముందుకు కదిలిస్తుంది.

## పుత్తడి బొమ్మ పూర్ణమ్మ

అప్పారావుగారి మరొక గొప్పగేయం 'పూర్ణమ్మ'. పూర్ణమ్మ విషాదాంత కావ్యం. లలిత లలితమైన వాడుకభాష పదాలతోనె అప్పారావుగారు అద్భుతంగా యీ కావ్యాన్ని సృష్టించారు. అప్పారావుగారి కవితాశక్తి పూర్ణమ్మలో కట్టలు తెంచుకొని ప్రవహించింది. ఎంతటిభావ తీవ్రతతో, హృదయావేదనతో అప్పారావుగారు పూర్ణమ్మను రచించారో ఆగీతాన్ని ఒక్కసారి చదివితే బోధపడుతుంది. పూర్ణమ్మను చదివితే శోకపూరితమైన ఒకజీవితాన్ని చూసిన అనుభూతి కలుగుతుంది ; విచారం ముంచుకొస్తుంది ; హృదయంలో చేయిపెట్టి కలచినట్టయి కన్నుల నీరు నిండుతుంది కన్యా

శుల్కం దురాచారానికి ఒక చిన్నది బలి అయిపోయిన సంఘటన ఇందలి కథావస్తువు ; ఇది వాస్తవిక జీవితపు సంఘటన. సంఘసంస్కరణ ఆదర్శంతో, ప్రయోజనంతో అప్పారావుగారు యీ గీతాన్ని రచించినా యిందులో కవితాశిల్పం చెక్కుచెదరలేదు. ఒక వైపున కావ్యంగా అలరారుతూనె మరొకవైపున దివ్యమైన సందేశాన్ని అందిస్తుంది ఈ గేయం.

## అపూర్వమైన దృశ్యాలు

పుత్తడిబొమ్మ 'పూర్ణమ్మ' గీతం ఒక్కటే అప్పారావుగారు 'ముత్యాల సరాల' ఛందస్సులో వ్రాయనిది. అప్పారావుగారి గీతాల కథా కథనంలో నాటకీయిత విశేషగుణం. తిక్కన మహాకవికి అప్పారాయకవికి నాటకీయత సమానధర్మం. అప్పారాయ మహాకవి గేయాలను చదువుతున్నప్పుడు మనం ఒకేసారి పాఠకులం, శ్రోతలం, ప్రేక్షకులమూ అవుతాము. ఆయన గీతాలను చదువుతుంటే మైమరచే సంగీతాన్ని వింటాము ; మనల్ని మనం మరచిపోయి అపూర్వమైన దృశ్యాలను అవలోకిస్తాము.

అప్పారావుగారి కథలు 'దిద్దుబాటు', మెటిల్డా', 'సంస్కర్త హృదయం' మొదలయినవి ఒక్కొక్కటి ఒక ఆణిముత్యం.

అప్పారావు గారు ఆసాంతం వ్రాసిన రచనలకంటె పూర్తిగా వ్రాయని రచనలు, వ్రాద్దామనుకొన్న రచనలే ఎక్కువ. అనారోగ్యం, సంస్థాన వ్యవహారాలు, బహుముఖ కార్యకలాపాటు అప్పారావుగారు అనుకొన్న రచనలన్నీ పూర్తిచేయలేక పోవడానికి కారణం. అప్పారావుగారు పూర్తిచేసిన రచనలు— ఆయా పత్రికలలో ప్రచురితమైనవి— గూడ మనకు అన్నీ దొరకడంలేదు. అప్పారావుగారు తమ డైరీలలో తాము వ్రాసి ప్రచురించినట్టు పేర్కొన్న కొన్ని రచనలు మనకు లభ్యం కాలేదు. అప్పారావుగారి లేఖలు చాల అమూల్యమైనవి ; అవి మామూలు లేఖలు కావు ; వివిధ విజ్ఞాన విషయాలతో సంపన్నవంతమైన పరిశోధనా వ్యాసాలు ఆయన లేఖలు. ఇటువంటి లేఖలను అప్పారావుగారు లెక్కలేనన్ని వ్రాసినారు.

అనారోగ్యంతో బాధ పడుతున్నప్పుడు, నీలగిరి కొండల్లో విశ్రాంతి తీసు కుంటున్నప్పుడు గూడ అనేక సమస్యలను చర్చిస్తూ లేఖలు వ్రాశారు. కాని మన దురదృష్టం, మనకీ లేఖలేవీ చెప్పుకోదగినన్ని దొరకలేదు. 'సారంగ ధర'తో పాటు ఆంగ్లలో అప్పారావుగారు వ్రాసిన 'చంద్రహాస' జాడ మనకు తెలియదు. వాడుక భాషలో వ్రాయ మొదలు పెట్టిన వ్యాకరణం మధ్యలోనె ఆగిపోయింది. ప్రామాణికమైన భారతదేశ చరిత్రను, ఆంగ్లదేశ చరిత్రను వ్రాయనిశ్చయించారు; యిదిగూడ పూర్తిగా కొనసాగలేదు. ఆధు నిక భారతీయ జీవితాన్ని అభివర్ణిస్తూ అప్పారావుగారు ఇంగ్లీషులో ఒక నవల వ్రాయాలను కొన్నారు. అందుకొరకు అప్పారావుగారు వ్రాసుకొన్న నవలా ప్రణాళిక మాత్రం లభించింది. ప్రామాణికమైన ఆంధ్రకవుల చరిత్ర రచన గూడ పూర్తికాలేదు. పాతిక సంవత్సరాలయినా నిండకముందే అప్పారావుగారు సంపాదకత్వం వహించి వెలువరించిన 'ప్రకాశిక' తెలుగు పత్రికల వెలుగును మనం చూడలేదు; మనకు అప్పారాయ మహాకవి అనర్ఘ రత్నా లెన్నో అందుబాటులోనికి రాలేదు.

## ఆహ్వాన పత్రం

నూతనమైన ఉత్సాహాన్ని కల్గించి, నవ్యమైన, పురోగమన శీలమైన శక్తిని ప్రసాదించే అప్పారాయ మహాకవి సాహిత్య ప్రపంచంలోనికి ఇదొక ఆహ్వాన పత్రం మాత్రమే.

---

## మహాకవి గురజాడ జీవితంలోని కొన్ని ముఖ్య సంఘటనలు

21– 9–1862 : విశాఖపట్టణం జిల్లా ఎలమంచిలి తాలూకా రాయవరంలో మహాకవి జననం.

14– 8–1883 : గురజాడ 'సారంగధర' కావ్యాన్ని ప్రశంసిస్తూ "రీస్ అండ్ రయ్యత్" పత్రికా సంపాదకులు శ్రీ శంభుచంద్ర ముఖర్జీ కలకత్తానుండి వ్రాసినలేఖ.

1– 4–1884 : విజయనగరం కళాశాలలో పదవ అసిస్టెంట్ లెక్చరర్‌గా నెలకు పాతిక రూపాయల జీతంపై నియామకం.

– 1–1886 : ఎనిమిదవ అసిస్టెంట్‌గా ప్రమోషన్.

– 1–1886 : బి. ఏ; పట్టభద్రత.

3– 3–1887 : కళాశాలలో 'లీన్' వుంచుకుంటూనే విజయనగరం జనరల్ డిప్యూటి కలెక్టర్ కచేరీలో సబ్బ్యూటం హెడ్‌గుమాస్తాగా ఉద్యోగం.

7– 3–1887 : పై ఉద్యోగం ఆర్డర్ వచ్చినతేదీ. ఆర్డర్ నంబర్ 560.

27–10–1887 : విజయనగరం కాంగ్రెస్ సమావేశంలో ప్రసంగించుట.

–10–1887 : నెలకు వంద జీతంపై మళ్ళీ విజయనగరం కళాశాలలో నాలుగవ అసిస్టెంట్‌గా లెక్చరర్ పదవి. ఆర్డర్ నెంబర్ 275.

20– 7-1888 : విశాఖపట్టణం స్వచ్ఛంద సేవాదళ సభ్యత్వం నెం. 225.

22– 6–1889 : విజయనగర సంస్థాన డిబేటింగ్ సొసైటీ ఉపాధ్యక్షులుగా ఎన్నిక.

5– 6–1896 : సంస్థాన శాసన పరిశోధకునిగా నియామకం.

1– 1–1897 : ఇంతకుముందే ముగించిన నాటకము 'కన్యాశుల్కము' మొదటి కూర్పునకు ఉపోద్ఘాత రచన.

– 6–1898 : ఆనందగజపతి సోదరి రీవా మహారాణికి ఆంతరంగిక కార్యదర్శిగా నియామకం.

24– 4–1905 : గురజాడ తండ్రిగారి మరణం.

—1906 : 'కొండు భట్టీయము' మొదటి సారిగా రచించుట.

11– 3–1909 : 'కన్యాశుల్కము'లోని కొన్ని అంకములను మార్చి వ్రాయుట.

1– 5–1909 : వాస్తవిక రచనా లక్షణాలను ప్రతిపాదిస్తూ శ్రీ సుబ్రహ్మణ్యం గారికి లేఖ.

– –1910 : బరంపురంలో నానావర్ణ సహపంక్తి విందులో పాల్గొనుట.

– –1910 : 'ముత్యాల సరాలు' రచన.

– –1910 : 'కొండుభట్టీయము' రెండవసారి రచించుట.

21– 4–1910 : 'బిల్హణీయము' మొదటి అంకము ప్రచురించుట.

24–11–1910 : 'గ్రామ్యశబ్ద విచారణము' వ్యాసరచన చేయుట.

29–12–1910 : 'ఆకాశ రామన్న'కు జవాబుగా వ్యాసప్రచురణ.

27– 3–1911 : 'నాది ప్రజల ఉద్యమం. దానిని యెవరిని సంతోషపెట్టడానికైనా వదలుకోలేను." ఆంధ్ర సారస్వత ప్రపంచమున మహాకవి ప్రకటించిన 'మాగ్నకార్టా'.

– 4–1911 : 'బిల్హణీయము' రెండవ అంకమును అచ్చొత్తించుట.

23– 1–1912 : గురజాడ గౌరవార్థం కలకత్తాలో బెంగాలీ సాహిత్యపరిషత్తు యేర్పాటుజేసిన తేనీటి విందు, సభ.

16– 5–1912 : మద్రాసులో జరిగిన ఆంధ్రసాహిత్య పరిషత్తు సభలో వ్యావహారిక భాషా ప్రయోజనం గురించి ప్రసంగించుట.

27– 6–1912 : తెలుగు భాషలో సాంకేతిక పదాల కూర్పుకు ప్రయత్నం.

15–11–1912 : 'కన్యక' ప్రచురణ.

–12–1912 : కలకత్తాలో రవీంద్రునితో సమావేశం.

– –1913 : 'సుభద్ర' పద్యకావ్యరచన.

30– 1–1913 : మద్రాసు విశ్వవిద్యాలయంలో 'ఫెల్లో'గా నియమించుటకు గవర్నర్ అభ్యర్థన.

20– 4–1914 : "ది మినిట్ ఆఫ్ డిసెంట్, టు ది రిపోర్ట్ అఫ్ ది తెలుగు కాంపోజిషన్ సబ్-కమిటీ ప్రచురణ.

30–10–1915 : 'దించు లంగరు' ప్రచురణ.

30–11–1915 : విజయనగరంలో ఉదయం ఎనిమిది ఇరవై నిమిషాలకు మహాకవి అస్తమయం.